జయంతి తే సుకృతినో
రససిద్ధాః కవీశ్వరాః.




# జయంతి

13

★

సంపాదకులు
విశ్వనాథ సత్యనారాయణ
జువ్వాడి గౌతమరావు

★

సంపాదక కార్యాలయము
ఉస్మాన్‌పురా, కరీంనగరము

★

సంపుటి 2 సంచిక 1
నవంబరు '59
విడిప్రతి 75 న. పై.

# సంపాదకీయము

కవులు, విమర్శకులు - సాహిత్య నిర్మాణము, సాహిత్యము యొక్క స్థితి వీరిమీద నాధారపడి యున్నదని చెప్పవచ్చును. సాహిత్యము యొక్క స్థితి నిజానికి భావుకులమీద నాధారపడియుండును. కాళిదాసాదుల కీర్తి నిలిపినవారు భావుకులు. ఈ భావుకులు కవులు కావచ్చును, విమర్శకులు కావచ్చును, తరితరులు కావచ్చును. కాని భావుకులనగా నిస్సంశయముగా పండితులు. భావుకులు పండితులైనప్పుడు కవులును విమర్శకులును కాక పోవచ్చును. కవులు పండితులు కాకపోవుట కలదు. అందరు కవులును పండితులని చెప్పుటకు వీలులేదు. కాని కొంత పాండిత్యము లేకుండ కవి కాడు. పోతన్నగారున్నారు. ఆయన సహజ పండితుడు. సహజపండితుడనగా నేమి? గురుముఖతః శాస్త్రాభ్యసనము చేసియుండక పోవచ్చును. సొంతముగా గ్రంథములు చదివి బహువిషయములు గ్రహించి యుండవచ్చును. మానవులలో కొందరు సహజ వివేకులు. వారి బుద్ధి పాదరసము వోలె ప్రవహించును. ఎంత పెద్ద విషయమైనను సులభముగా గ్రహింతురు. కొందరు మందబుద్ధులు. మరికొందరు జడులు. కాని సృష్టిలోని రహస్యమేమో తెలియదు. ఈ మూడు రకములైన మనుజులలో కవులుందురు. పరమవివేకి యైనవాడు కవి కావచ్చును. మందబుద్ధియు కవి కావచ్చును. జడుడును కవి కావచ్చును. విమర్శకులలో కూడ నీ మూడురకములవా రుందురు. భావుకులలో మాత్రముండరు. భావుకులు నిస్సంశయముగా నిరంతరముగా వివేకులు.

సాహిత్య నిర్మాణమును కవులమీద నాధారపడి యున్నది. కవులు వివేకులు మందబుద్ధులు జడులు కావచ్చుటచేత కవిత్వమునందు వివేకము గల కవిత్వము, బుద్ధియొక్క చొచ్చికొనిపోవుట లేని కవిత్వము, జడత్వలక్షణముగల కవిత్వము–మూడు విధముల కవిత్వముండును. భావుకులు వివేకి వ్రాసిన కవిత్వమునే యాస్వాదింతురు. తక్కిన రెండువిధములైన కవిత్వములు కాలాంతరమున నమసిపోవును. కానిచో సంస్కృత మట్లుండనిండు. వేయియేండ్లనుండి తెలుగు కవిత్వమున్నది. ఒక యేబది యిరువది యేండ్లు ఒక తరముగా తీసి కొన్నను ఒక్కొక్క తరమున తెలుగుదేశమున కనీసము పదిపేలమంది కవులుద్భవించి యుందురు. సుమారు రెండు లక్షలమంది కవులైనను నేటికి వేయియేండ్లలో నుద్భవించి యుండవలయును. అంతమంది పేర్లు మనమెరుగనే యెరుగము. కవుల చరిత్ర చెప్పు సంఖ్యయే చాల యెక్కువ. నిజముగా నిలచిన కవులెవరు? మొత్తముమీద పదిమంది. వీరిని నిలిపినవారెవరు? భావుకులు. భావుకులనగా పండితులైన రసజ్ఞులు. ఇది సామాన్యముగ సర్వ దేశములయందు నున్న సకల సారస్వతములయందు జరుగుచున్న విషయమే. ఈ భావుకులతోపాటు సామాన్య జనములోకూడ విశిష్టమైన మనఃప్రవృత్తి కలవా రుందురు. వారిని భావుకులని యనలేము కాని భావుకలక్షణము వారిలో నుండును. వారును భావుకజాతిలోనివారే. వారి బలము చేతనే కవిత్రయము, సోమన్న, శ్రీనాథుడు, పోతన్న, పెద్దన, రామరాజ భూషణుడు, తిమ్మన, తెనాలి కవి, చేమకూరవేంకన మొదలైనవారు నిలచిరి. ఈభావుక జగత్తునకు సంతుష్టి నీయలేని కవులు లోపించిరి. ఈభావుకు లిచ్చటనుందురు, ఇట్లుందురని చెప్పుటకు వీలులేదు. వారు కాలస్వరూపులు, కాలము వారిని నిర్ణయించును. వారు కాల స్వరూపులై సద్గ్రంథములను కాలముమీద నిలువబెట్టుదురు. ఇది రహస్యమైన సాహిత్య నిర్మాణస్థితుల యొక్క పరంపర.

ఇది యిట్లుండగా నింతకుముందు తరమని చెప్పబడినది. ఆ తరమునకు నిశ్చయమైన పరిధులు లేవు. ఒకొకప్పుడు రెండు మూడు తరములుకలిసి యుండవచ్చును. కాని ఒక్కొక్క తరమును తీసి కొని విచారించినచో ఈనిర్మాణ స్థితుల యొక్క స్వరూపము విచిత్రముగా నుండును. దానియందు

నిత్యమైన కాలస్వరూపము భాసించనే భాసించును. ఒక్కొక్క తరమున కవులు వేలమంది యుందురు. విమర్శకులు నంతమంది యుందురు. కవులు కాని వా రెంతమంది యుందురో చెప్పలేము. అందు కనియే 'యే మహాత్ములు కలుగ భూమిశసభలలో కవులకు మిపుల విఖ్యాతికలిగె' 'నీవునుం గవివి కావుగదా పలనాటిలోపలన్' మొదలైనపద్యములు కలవు.

కవులతో నెప్పుడును బాధలేదు. వాడు వ్రాసి కొనును. వాని దారిని వాడు పోవును. బ్రతికి యున్నప్పుడు తాను కాళిదాసంతవాడ ననుకొన వచ్చును. అభినవ కాళిదాసులు, అభినవ దండులు, అభినవ వ్యాసులు, వాల్మీకులు ప్రతి తరమునం దుందురు. వారితరము వెళ్ళిపోవును. వారిపే రెవ్వరును వినరు. వారుండిరనియు తెలియదు. కాని విమర్శకులతో పేచీ యుండును. వీరును మువ్విధములు గదా! కవులున్నారు, భావుకులున్నారు. కవులు వ్రాసికొందురు. చనిపోదురు భావుకులు సత్కావ్యమును నిలబెట్టుదురు. ఈ భావుకులు పండితులైనవారు, పండితులు కానివారు నని రెండు విధములుకదా! పండితులైన భావుకులకు మొప్పము లేదు. పండితులు కాని భావుకులకు మొప్పమున్నది. ఏలయనగా వారు తెలిసినవారు కారు. హృదయమునం దానందించగలవారు. చెప్పినచో ఆహా! యెంతబాగున్నదని యనుకొనెడి వారు. ఈ భావుకులలో విద్వద్భావుకులసంఖ్య తక్కువ. రెండవ రకపు భావుకులసంఖ్య చాల యెక్కువ. నన్నయ్యగారి గ్రంథము నిలచి యున్నది. విద్వద్భావుకులు దానిని నిలిపినారు. అవిద్వద్భావుకులు దానిని పఠించుచు తమకు చేతనైనంత యానందించుచు కావ్యమును నిలబెట్టినారు. దుష్ట విమర్శకుడు చేయు నపకార మెచ్చట నున్నదనగా నొక సద్గ్రంథమునకీ వ్యాప్తి కలుగకుండ చేయుటలో నున్నది. ఈ కువిమర్శకుడు కుకవికంటె నెక్కువ సాహిత్యద్రోహి. ఇద్దరు వాని తరముతో వారు వెళ్ళిపోయెడివారే. కుకవి యేమియు చేయలేడు. కువిమర్శకుడు అవిద్వద్భావుకుల మనసులను భంగించును. సత్కార్యము యొక్క స్థితికి ధూమకేతు ప్రాయుడగును. ఈ కువిమర్శకుని లక్షణ మెట్లుండును? మనస్థితి పాండిత్యము కుకవికిని వీనికిని సమానమే కుకవివల్ల జగద్ద్రోహము జరుగదు. కువిమర్శకుని వలన జరుగును. వీరి పాండిత్యము లెట్టివి? వీరి మనస్సు లెట్టివి? అని విచారించగా మనస్సు లట్లుంచి పాండిత్యమును గూర్చి విచారించవలయును. గురుముఖతః వీరిద్దరు నేదియు చదువుకొన్నవారు కారు. సహజముగా మందబుద్ధులు. చెప్పినను తెలిసికొను నేర్పుండదు. వారి యిష్టము వచ్చిన గ్రంథములు వారు చదువుదురు. వారి యిష్టము వచ్చిన వ్యాఖ్యానములు వారు చేయుదురు. పద్యము వ్రాయుట యెట్టిదో, యొక వ్యాసము వ్రాసెడు శక్తియు నట్టిదే. ఆ శక్తులు వానియంతట నవి యుండును. వాని వెనుక పాండిత్యామ లక్కరలేదు. అక్కరయున్నచో నేల పాటలు, సువ్విపాటలు మొదలైన వుండవు. పాండిత్యము లేనిబుద్ధి వానియందుకూడ నొక్కొకప్పుడు కవితాగుణాధానము చేయుచుండును.

ఈ కాలమున అనగా ఈ తరమున ఈ తరమనగా మరికొంత వెనుకకుకూడ పోవచ్చును—ఈ కువిమర్శకు లెక్కువయైనారు. కవులెక్కువైనారు. దీని మూలకారణము ఇంగ్లీషు విద్యాభ్యాసము. పూర్వకాలమున పంచకావ్యములు సవ్యాఖ్యానముగా గురుముఖతః చదివెడివారు. ఈ కాలమున నా సంప్రదాయమే లేదు. కవులయు విమర్శకులయు భాషాజ్ఞాన మెట్లున్నదనగా వ్యాకరణము దాక పోవుట యెందులకు, నమరము నాంధ్రనామ సంగ్రహమును నెరుగరు. కళాశాలలో పాఠ్యభాగములుగా చదివిన కావ్యములలోని ఏకదేశపు ముక్కలు వారి పాండిత్యమునకు పునాదులు. ఈ కళాశాలలలో నాంధ్రభాష ప్రత్యేకముగా

చదువుటలో నెక్కువ చెప్పబడునది సారస్వత చరిత్రమును, భాషాచరిత్రమును.

కవులు వీరిలోనుండియే పుట్టుచున్నారు. విమర్శకులు కూడ వీరిలోనుండియె పుట్టుచున్నారు. మరియు నీనడుమ హిందీ సారస్వతము చదివి దాని దృష్టితో తెలుగుగ్రంథాలు చదివి కొందరు కవులు కొందరు విమర్శకు లగుచున్నారు. హిందీ సాహిత్యములో పూర్వసాహిత్యము వ్రజభాషకు నవధి భాషలకు చెందినది. అధునిక సాహిత్యము ఖడీబోలీకి చెందినది. ఈ ఖడీబోలీలో నుద్భవించిన సారస్వతములో ఎక్కువభాగము ఆంగ్లేయ భాషా భావముద్రితము, హిందీ భాషయొక్క ప్రబలత్వము చేత నచ్చటి నేటికవులు మహానుభావులని పించుకొను చున్నారేమో ! యాథార్థ్యమునకు నా సేతుశీతాచలము కడచిన మూడు శతాబ్దులుగా నింగ్లీషుభాషచేత పరిపాలింప బడుటచేత జీవితము నందన్నిశాఖలయందువలెనే సారస్వతము నందుకూడ ప్రతి రాష్ట్రీయ భాషయందు సమాన లక్షణములుగల కవులే యున్నారు. ఈ లక్షణములు సంప్రదాయ భావజనితములు కావు. సూక్ష్మమైన భారతీయ లక్షణ గ్రంథసూత్రములచేత విమర్శించినచో నిలువవు. వెనుకటి తరమునందుకంటె ప్రస్తుతపు తరమునందు మరియొక విశేషము కలదు. ధ్వన్యాలోకము రసగంగాధరము భరతశాస్త్రము మొదలైన గ్రంథములు తర్జుమాలు ప్రబలి నగము జీర్ణించుకొన్న యా గ్రంథములలోని పంక్తులును మాటలును నేటి విమర్శకులు యథేచ్ఛముగా వాడుచున్నారు. ఆ గ్రంథములు తర్కశాస్త్ర జటిలములు. పండితుల సన్నిధియందు కూర్చుండి నేర్చికొనదగినవి. ఈ కువిమర్శకులు తద్గ్రంథముల నుండి పంక్తుల నుదాహరింతురు. ఆ యుదాహరించిన పంక్తులలోని యర్థములకు నా మాటల లోని యర్థమునకు వీరు వ్రాసెడి దానికి సంబంధ ముండదు. ఇట్టివారి పాండిత్యమును గూర్చి లోకమునందు కథలు గలవు. 'మానవాధీశ్వర మణుగునాలికవాడు' మణుగునాలిక యెవరి కున్నదిరా ? 'ఇనుము విదర్భదేశమున ఈరున కుండెను భర్త' 'కోనంగులాడంగ ఇత్యపులు కూయంగ' మొదలైనవి ఏతాదృశ పండిత పాండిత్యాతిశయము చెప్పుచున్నవి. వీరికి ఏమియు తెలియదు. శతృప్రత్యయము వారికి శత్రుప్రత్యయము. భూతకాల మనగా భూతశబ్దమునకు దయ్యమని యర్థము. మరియు సంస్కృత శబ్దములలో భవత్, గచ్ఛత్, ఏధమాన మొదలైనవి. ధాతువులు రెండువిధములని మొదటివిధపు ధాతువుల కట్లుండును, రెండవవిధము ధాతువుల కిట్లుండును అని తెలియవలసిన యవసరము వారికిలేదు. ఒక గొప్పకవి యొక సభలో 'స్థితాః క్షణం పక్ష్మసు తాడితాధరాః, పయోధరోత్సేధ నిపాత చూర్ణితాః' మొదలైన శ్లోకము చదివి నేటి ఇంకొక కవి పద్యము చదివి కాళిదాసుకంటె నేటి కవి పద్యములో క్రమపరిణామము మిక్కిలి గొప్పగా నున్నదని చెప్పినాడు. ఉపన్యాసమైన తరువాత యొక తెలిసినవాడు ఆ కవిని పిడిగా పిలిచి అది యట్లుకాదు. స్థితాః అన్న దానికి ప్రాణాయామము చేయు సమయము నందలి పద్మాసనము యొక్క స్థితి వ్యంగ్యభూతముగా నున్నది అని చెప్పగా అట్లా నాకు తెలియదు అన్నాడు. తెలియనప్పుడు కాళిదాసుకంటె నేటి కవి యధికు డనుట సాహసము కదా ! దీనివలన కాళిదాసుకు వచ్చిన నష్టము లేదు.

ఇదియంతయు నెందుకు చెప్పబడుచున్న దనగా నాధునిక విమర్శకులయొక్క సంప్రదాయ మెరుగని స్థితిని తెలియజేయుటకు. అవిద్వాంసులైన భావుకులు ఇట్టి విమర్శలచేత చెడిపోవుదురు. పైగా మానవస్వభావ మెట్టిదనగా తెలిసిన కొద్దితో సంతుష్టి పొందెడిది. అదియే పరమప్రమాణ మనుకొనెడిది. ఇట్లుండగా పరమభావుకు లున్నారు గదా ! మహాకవులు వారివలన గదా నిలచెడిది. ఏ తరమున కాతరము నశించిపోయిన తరువాత

# జీవుని వేదన కావ్యపరమార్థము

ధూళిపాళ శ్రీరామమూర్తి

కావ్యమందు బరమార్థ మేదియన్న విచారము కావ్యముతోడనే పుట్టినది ఈ విచారమంతయు నలంకార శాస్త్రముగా రూపొందినది. ఈయలంకార శాస్త్రమునందు వివిధములైన మతములు గలవు. కావ్యమునందు ప్రధానమైనది యలంకారమని యొకరు, గుణమని యొకరు, రీతియని యొకరు, నిట్లే మఱికొందరు ధ్వనివక్రోక్త్యౌచిత్యాదులనియు జెప్పిరి. కాని ఈమాటలన్నియు పారిభాషికములు. ఒకే ప్రత్యేకార్థ ప్రతిపాదనమునకై కల్పితములు. కాలక్రమమున నివి నిత్య వ్యవహారాపతితములై వానియందలి ప్రత్యేకార్థ ప్రతీతిని బోగొట్టుకొన్నవి. ఈమాటల యర్థ నిర్ణయమునందు శాస్త్రకారులకు గూడ నేకాంగీకారములేదు. కాబట్టి కావ్యపరమార్థమును గుఱించి పునర్విచారణ మావశ్యకము. ఆయా కాలములయందు సహృదయులు కావ్యతత్వమును విచారించి పూర్వుల యుపదేశములందొక యనుగతి కల్పించుకొని సంప్రదాయమును నిలబెట్టవలయును. లేనినాడు పూర్వుల యుపదేశములు పఠన పాఠనములందున్నను శుకానువాదములై వ్యర్థములగును. అందుచేత మనము కావ్య పరమార్థ మేదియని పునర్విచారించుకొనవలెను. అది యొక యలంకారమో, రీతియో, గుణమో, ధ్వనియో యనుకొన్న మనకు దానిని గుఱించి సంపూర్ణావగతి గలుగదు.

కావ్యపరమార్థ మేదియో యెఱుంగవలెనన్న కవియన నేమియో తెలిసికొనవలయును. కవియన నేమియో తెలిసికొనినగాని కావ్యపరమార్థ మవగతముగాదు. ఆ శబ్దమున కర్థము దెలిసికొనుటకా శబ్దము యొక్క వ్యుత్పత్తిని దెలిసికొనవలయును. 'కవృ—వర్ణనే' యను ధాతువునుండి 'కవి' శబ్దము పుట్టినది. కవయతే-వర్ణయతీతి కవిః అని దాని వ్యుత్పత్తి. కవియనగా వర్ణించువాడు, వర్ణనము క్రియ, ఇది సకర్మకము. కాని పైనిచెప్పిన వ్యుత్పత్తియందా క్రియ చెప్పబడి యుండలేదు. అందుచేత మనము దానిని దెచ్చి పెట్టుకొనవలయును. చెప్పబడని యర్థమును, నౌచిత్యము చేత సంపాదించుకొనుట సంప్రదాయ సిద్ధమైనది. ఇచ్చట దేనిని కర్మగా స్వీకరించుట యుచితము? దేనినో యొకదాని ననుకొనుటకంటె దేనినైనను ననుకొనుట యుచితముగదా! అనగా నేదృశ్యమైనను వర్ణించువాడు కవియన్నమాట. ఈదృశ్యములు భూత వర్తమాన భవిష్యత్కాలికములు గావచ్చును. ఈ యన్నిదృశ్యములు కలిసి లోకము, 'లోక్యతే ఇతిలోకః' 'చూడబడుచున్నది లోకము.' చూచుట యనగా ప్రత్యక్షప్రమాణముచే గ్రహించుట లేక యాగ్రహణము ప్రత్యక్షానుభవమగుట. భూత వర్తమాన భవిష్యత్కాలిక దృశ్యములలో దేనినైనను ప్రత్యక్షముగా ననుభవించి వర్ణించువాడు కవియని యర్థమును గ్రహింపవచ్చును.

కవి యొకదృశ్యమును జూచును. దానిని వర్ణించును. ఆదృశ్యమును మనమును జూచితిమనుకొందము. మనమును దానిని వర్ణించితి మనుకొందము. మనమును కవులమగుదుమా! అయినచో లోకమున గవి కానివాడనుచు నుండరాదు మనము కవులముగాము. మనలను కవులని యెవ్వరు ననుట లేదు కారణమేమి? మన వర్ణనమునందును గవి వర్ణనమునందును నొక ముఖ్యమైన భేదము గలదు.

మన మొక దృశ్యమును వర్ణించిన దాని నెవరికి వర్ణింతుము ? ఆ దృశ్యమును జూడని వారికి వర్ణింతుము. చూచినవారికి మనము వర్ణింప నక్కఱ లేదుగదా! వారికి దానియందు 'ప్రత్యక్షాను భవ' మున్నది. ఒక వస్తువును గుఱించిన ప్రత్యక్షానుభవము గలవాడు పరోక్షజ్ఞానము నపేక్షింపడుగదా! కాబట్టి చూచినవారికి మన వర్ణన మవసర ముండదు. ఆ చూడనివారికైన నొక్కపరి వర్ణించిన జాలును. ఆ యొకపరియే వారికి దానియం దాదరముండును రెండవపరి వర్ణించిన దానియందు వారి కాదర ముండదు. కారణ మేమి ? అది వారికి పరిచిత మగుటవలన. పరిచిత మైనది ప్రాతవడి యనాదరణీయమగును. క్రొత్త వింత. ప్రాత రోత.

మఱి కవివర్ణన మిట్లుగాదు. అతడు మనకు బరిచితమైనదానిని వర్ణించినను, మనకు ప్రత్యక్షానుభవమైనదానిని వర్ణించినను బూర్వమువలె గాక యది మనకు గ్రొత్తగ గన్పించి పరమాదరణీయ మగుచున్నది. మన మా కవికావ్యము నెన్ని మారులు చదివినను మన కది క్రొత్తగనే కన్పించుచున్నది. మనకు దానియం దాదరము తగ్గుటకు మారు పెరుగుచున్నది. ఇది సర్వానుభవ సిద్ధమైన విషయము. దీనిని వివదించువాడులేడు. ఇది మన వర్ణనమునకు గవి వర్ణనమునకును గల భేదము. అందుచేత లోకమును నవీనముగా వర్ణించువాడు కవియని యర్థము లభించినది.

మఱి యీ నవీనత యన నేమి ? పూర్వక్షణమున నపరిచితమైన వస్తువు మనకు గ్రొత్తగా గన్పించును. కాని కవి వర్ణన మందలి నవీనత ఇట్టి క్రొత్తదనము గాదు. అయినచో నది పరిచిత వస్తు వర్ణనమునం దెట్లు సంభవించును ? కాబట్టి యీ నవీనత కవి వర్ణనమునందు నిత్యమైనది. కాబట్టియే కాళిదాసాది కవుల కావ్యములను మనము పూర్వ మెన్నిసార్లు చదివినను మఱల మఱల నధికాదరముతో జదువుచున్నాము. కాబట్టి కావ్యము నందలి నవీనత కాలికమైనది గాదు. నిత్యమైనది. కాలము నధిగమించినది. ఇట్టి నిత్య నవీనతయే వర్ణనమునకు బ్రాణము. ప్రాణవంతమైన వర్ణనము చేయువాడే కవి. లోకమును నిత్య నవీనముగా వర్ణించుటకు దానిని నిత్య నవీనముగా దర్శించుట యవసరము. ఇట్టి దర్శన వర్ణనములకు గావలసిన శక్తి కవియం దున్నదని యొప్పుకొనవలయును. దీనినే ప్రతిభయని యాలంకారికులు పేర్కొనిరి. ఈ ప్రతిభ స్వరూపము కావ్యములయందు నైపుణ్యరూపమున మనకు గన్పించుచున్నది. ఈ నైపుణ్యమే వర్ణనమునకు నవీనతా సంధాయకము. ఈ యభిప్రాయము నంతయు 'వర్ణనా నిపుణః కవిః' యని భట్టతౌతుడు సంగ్రహించెను.

పైనచెప్పిన యీ నిత్య నవీనత కవి వర్ణనమునం దెట్లు సంపాదించుచున్నాడు? లోకమును నిత్య నవీనముగా దర్శించుటవలన నంటిని. లోకమును నిత్యనవీనముగా దర్శించుట యననేమి? లోకమును మనము చూచుచుంటిమి ; కాని మనము చూచు దృశ్యము లన్నియు మనకు సరిపడునవి కావు. కొన్ని దృశ్యములను మనమంగీకరింతుము. ఆదరింతుము. అట్టి దృశ్యముల నెల్లప్పుడు చూడవలయునని కాంక్షింతుము. కాని మఱికొన్ని దృశ్యములను మన మేవగించుకొందుము. ద్వేషింతుము. అట్టి దృశ్యము లెప్పుడును మనము చూచుటకు గాంక్షింపము. ఈ విధమైన ద్వంద్వానుభూతి సుఖదుఃఖానుభూతి మనకు లోకమునందు గలుగుచున్నది. ఇట్టి సుఖదుఃఖానుభూతి మనకు క్షణికముగా గ్రొత్తదై కాలక్రమమున ప్రాతవడి పోవును. ఆ క్షణమున గ్రొత్తదనము మఱుక్షణమున బ్రాతదనము. ఇట్లు మన యనుభూతి కాలముచేత బరిమితమైనది. కాలముచేత ముద్రితమైనది. అందుచేత లోకముయొక్క యవధులను దాటినది గాదు. ఇట్టి యనుభూతినే లౌకికానుభూతి యందురు.

రింతము. ఇందలి తచ్ఛబ్దమున కర్థమేమి? మొదటగా గావ్యమునందు వర్ణనీయమగు వస్తువనుకొందము. వస్తువనగా నాయకుడో, యితివృత్తమో, సంఘటనయో యేదియో యొకటి కావచ్చును. మయట్ ప్రత్యయమునకు వికారమర్థము. తన్మయమగుటయనగా హృదయము వర్ణనీయ వస్తు వికారమునందుట, అనగా మనసావస్తుస్వరూపమే యగుట అప్పుడా వస్తువునకును మనస్సునకు నేకత్వము సంభవించును. మనసు మనసుగా లేదు. వస్తువు వస్తువుగా లేదు. మనసు మనసుగా నున్నంతవఱకు వస్తువు వస్తువుగా నున్నంతవఱకీ యేకత్వము కుదురదు. అపుడు మనసునకును వస్తువునకును మధ్య కొన్ని యడ్డంకులుండును. వస్తువు తెలిసికొనబడునది మనసు దెలిసికొనునది. రెండిటికిని గల సంబంధము దెలిసికొనుట. ఈ మూడింటిని గలిపి త్రిపుటి యందురు. ఈ త్రిపుటి యున్నంతవరకు బైని చెప్పిన యేకత్వము గుదురదు. తన్నుదాను మఱచిపోయినపుడే యిట్టి యేకత్వము సంభవించును. తాను వేరు వస్తువు వేరనుకొన్నంతవఱకు దన్మయత్వముండదు. ఈ భేదమును మీరుటయే యేకత్వము. ఈ యేకత్వజ్ఞానమే యచ్చమైన యనుభూతి. న్యాయమున కిట్టి యనుభూతియే తన్మయత్వమునందలి తచ్ఛబ్దమున కర్థము. సర్వనామమగు తచ్ఛబ్దమునకు బూర్వ పరామర్శ లేనిచోట నర్థాత్ సిద్ధమగు నర్థమును జెప్పుటయే సంప్రదాయము. పైని చెప్పినరీతిగా నచ్చమైన యనుభూతి చెప్పబడక పోయినను నర్థాత్ సిద్ధమగుచున్నది. కాబట్టి యీ యచ్చమైన యనుభూతియే తచ్ఛబ్దమున కర్థమని చెప్పుట యుచితము. కాబట్టి తన్మయత్వమనగా హృదయమిట్టి యనుభూతి వికారము నందుట. అనగా నిట్టి యనుభూతిని బొందుట. ఇట్లు సహృదయ శబ్దమును విచారింపగా వచ్చిన యర్థమే పైని జెప్పిన యభినవగుప్తుని నిర్వచనమునందు సంగృహీతమైనది. ఇట్లు సహృదయ శబ్దమును విచారించినను నలౌకికానుభూతియే కావ్యపరమార్థమని తేలుచున్నది.

కవి యిట్టి యనుభూతిని బొందును. అతని యనుభూతినుండి సాహిత్యము స్రవించును. ఆ సాహిత్యమును సేవించి సహృదయుడిట్టి యనుభూతినే పొందును. కవియొక్క యీ యలౌకికానుభూతి సాహిత్యమార్గమున సహృదయుని బొందుచున్నది. ఈ యలౌకికానుభూతినే యాలంకారికులు రసమని వ్యవహరించిరి, ఈ రసమే పరిణతమైన జీవుని వేదన.

# తపశ్శాలి | గంధం యాజ్ఞవల్క్యశర్మ

ఉద్యోగమనే యాంత్రిక జీవితంనుండి రెండు సంవత్సరాల తరువాత అతికష్టంమీద ఓ నెలరోజుల పాటు సెలవు తీసికొని, పాలెం చేరాను.

ఏ వేళ చూచినా వచ్చేవారితోను, పోయేవారితోను కలకల లాడుతూ సందడిగా, దివాణంలా కన్పించే మామయ్యగారిల్లు నిర్మానుష్యంగా అలికిడే లేదు.

దేదీప్యమానంగా వెలిగిపోయే ఆ గృహం - చీకటి కోనేరులా వుంది.

భుజంగరావు మామయ్య ఊరి కరణం; తినా కుడవా లోటులేని సంసారం; చుట్టుపట్ల నాలుగు గ్రామాలలో వలుకుబడి గల వ్యక్తి.

ఆరడుగుల నిండైన గంభీర విగ్రహం ఆయనది. ఏనాడో గాంధిమహాత్ముని పిలుపు విని, ఖద్దరును జీవితాంతం అభిమాన దుస్తులుగా స్వీకరించి, వాటినే ధరించిన మామయ్య; ..నిష్కల్మషంగా నవ్వగలిగిన నిర్మల స్వభావుడు; బంధుసముద్రుడు; అలాంటి మామయ్య లేకపోయాక ఆ దివాణం చిన్నపోక ఏముంది? రాజభవనంలా వెలిగిపోయిన ఆ భవనం మామయ్య లేకపోయాక చీకటి కోనేరు కాక మరేముంది?

మినుకు మినుకుమంటూ చిన్న దీపం గాలికి రెపరెప లాడుతూ...మామయ్యగారి ఇంటి ఉత్తరపు వైపు ద్వారంనుండి కనిపిస్తోంది.

"అమ్మా! మామయ్యగారింటిలో సందడే లేదేం" భోజనం చేసి పెరట్లో చేయి కడుక్కొంటూ అడిగాను అమ్మను.

"ఆ ఇంటి దీపమే ఆరిపోయాక...ఇంకా ఏం! సందడి...అన్నీ ఆయనతో పోయాయి..." నిట్టూర్చింది అమ్మ. భుజంగరావు మామయ్య అమ్మకు పెదతండ్రి కొడుకు - అన్నయ్య.

నెల్రక్రితం మామయ్య చనిపోయినట్లు జాబు వచ్చింది. ఆశ్చర్యపోయాను. నమ్మలేకపోయాను. అలాంటి వ్యక్తికి మరణం వుంటుందా అని. ఈ నాటికి మామయ్య మరణించారు అనే భావం నాలో సాతుకోలేక పోయింది. నా కర్థం కాని విశ్వాసం నాచుట్టూ తిరుగుతూ 'మామయ్య చనిపోయారా?' అని ప్రశ్నించేది.

"ఎక్కడికిరా బయలుదేరావు...అర్ధరాత్రివేళ" అంది అమ్మ....; "మామయ్యగారింటికి" అన్నాను చెప్పులు తొడుక్కొంటూ: మా ఇంటికి ఫర్లాంగు దూరమన్నా లేదు మామయ్యగారిల్లు.

ఉత్తరపువైపు ద్వారంగుండా లోపలకు అడుగు పెట్టాను. ఇల్లు బావురుమంది. మనస్సంతా గడబిడ లాడింది; "రారా సత్తి! రా! ఎప్పుడొచ్చావు?" అని మామయ్య ప్రశ్నించినట్లైంది. త్రుళ్ళిపడ్డాను.

"ఎవరు సత్తెంగారా బాబూ!" అన్నాడు పాలేరు గంగులు.

"అవును గంగులూ...ఎలావున్నావు?"

"ఉన్నాంబాబూ...బాగానే వున్నాం...ధర్మ రాజులాంటి పంతులుగారికి చావు ముంచుకొచ్చింది కాని నాలాంటివాడికి కాదుగా" గంగులు కను కొలకులనుండి జారిన అశ్రుకణాలు, ఆ మినుకు మినుకు మంటున్న దీపపుకాంతిలో కూడ కన్పించాయి.

మామయ్యకు కుడిభుజం గంగులు.

విశ్వాసానికి 'ప్రాణం' గంగులు.

మామయ్యను జ్ఞప్తికి తెస్తూ, మిగిలిన జ్ఞాపకాలలో గంగులు ఒకడు—

"గంగులూ, అత్తయ్య...ఎక్కడ ?"

"ఇంకెక్కడ, ఆ దేవునిగదిలో...పంతులుగారు పోయిన, ఈ రెండు నెలలుగా, తిండి తిప్పలు లేకుండ, కంటికి, మింటికి ఒకేధారగా కార్చుతూ ఆ దేవునిగదిలోనుండి బయటకే రాకుండా అక్కడే వుంటువ్నారు."

గంగులు మాటలు వింటూనే దేవునిగదివైపు నడిచాను. దేవునిగది దీపపు వెలుగులో భగవద్గీత చదువుకొంటున్న అత్తయ్య నా అలికిడికి తలెత్తి "ఎవరు ?" అంది.

"నేనత్తయ్యా సత్యాన్ని" అన్నాను.

"రా నాయనా" అన్న అత్తయ్య గొంతు బొంగురు పోయింది, కొన్ని క్షణాల తరువాత సన్నగా, ఎక్కడో జీర్ణంగా విన్పించినట్లు ఎక్కిఎక్కి వస్తున్న ఏడుపు విన్పించింది.

'ఊరుకో అత్తయ్యా. .ఊరుకో...మామయ్య ఒకవిధంగా అదృష్టవంతులే, రోగంతో మంచంలో ఇన్నాళ్ళు తీసికోకుండా హాయిగా దాటిపోయారు" అంటూ ఊరడించటానికి ప్రయత్నించాను.

"అవును నాయనా, ఆయనకేం.. మహారాజు... దాటిపోయారు...అదృష్టవంతులే ! నేనే దురదృష్టవంతురాలిని. ఆయన కళ్ళముందే నా జీవితం తెల్లవారినట్లైతే" నిట్టూర్చింది అత్తయ్య.

★ ★ ★

నాటి స్వాతంత్ర్యోద్యమ శంఖారావం, గాంధీ మహాత్మునినుండి విన్పించిననాడు, సర్వస్వాన్ని వదలి...ఖద్దరుబట్టలతో, యోగిలా దేశానికి మార్గగాములై బయలుదేరిన వారిలో మామయ్య ఒకరు. ఐదుసంవత్సరాలు జైళ్ళలో అష్టకష్టాలు పడి పోలీసుల లాఠీ దెబ్బలకు గురి అయ్యారు మామయ్య.

దేశం...ప్రజలు... ప్రజాక్షేమం...ప్రజాహిత కార్యాలు...వీటికోసం ఏనాడూ తనశక్తి కొలది, పాటుపడటానికి వెరచిన వ్యక్తికాదు: అందుకే చుట్టుపట్ల గ్రామాల వారంతా....మహానుభావుడు అన్నారు. భుజంగరావు మామయ్య అన్నా ఆయన మాట అన్నా ఎలాంటివారైనా గౌరవించేవారు. ఊరిలో ఎలాంటి తగవైనా, సమస్య అయినా తల ఎత్తితే మరుక్షణంలో మామయ్య దగ్గరకు రాకుండ పోయేదికాదు. ఇరుపక్షాలను సంతృప్తిపరచి— "నాయనా మనలో మనకు ద్వేషం...అసూయ కోపతాపాలు కూడవు—ఇలా మనం ఒకరినొకరు ద్వేషించుకొంటూ తగవులాడుకొంటూకూర్చొంటే దేశమెలా ముందుకు పోతుంది ? కోటానకోట్ల అభాగ్యులున్న మన దేశస్థితిని బాగుపరచటానికి కృషి చేయవలసిన మనం కాలాన్ని వ్యర్థం చేస్తూ వుంటే ఎలా, ఆలోచించండి" అనేవారు.

ఆయన ధర్మస్వరూపుడు.

ఆయన మాట్లాడినదంతా శాసనంలా స్వీకరించేవారు. భుజంగరావుగారు అంటే పిల్ల, పెద్ద, ఆడ, మగ అంతా భయపడేవారుకాదు - ప్రేమించేవారు ఆయన, జీవితంలో ఆశించిన ఫలితాలను అందిపుచ్చుకొన్న వ్యక్తి: ఆయనది అరముగ్గిన జీవితం - కానీ ఏం లాభం ?

గంభీరసముద్రం అంతర్భాగంలో సలసల కాగుతున్న బడబాగ్నులు లేవూ ? ఎత్తు పల్లాలు లేవూ?

నిశ్శబ్దంగా నిండుగా కన్పించే పర్వతగర్భంలో అగ్నిగోళాలు నిక్షిప్తమై వుండలేదూ ?

మామయ్య జీవితమూ అంతే !

మామయ్యకు ముగ్గురు కొడుకులు, ముగ్గురు కూతుళ్ళు పెద్దవాడు స్వాతంత్ర్యోద్యమ మప్పుడు పుట్టాడట. 'తిలక్' అని పేరుపెట్టారు మామయ్య. రెండవవాడు 'కృష్ణారావు', ఆఖరివాడు 'శేఖర్'; పెద్దఅమ్మాయి పేరు కస్తూరి, రెండవ అమ్మాయి పేరు సావిత్రి. మూడవది సుశీల.

మామయ్య జీవితచక్రం నలువదియైదు సంవత్సరాలు భ్రమించాక, ఆభ్రమణంలో ఏదో అపశ్రుతి పల్కినట్లు అయింది. పెద్దకొడుకు దేశనాయకుడై

'తిలక్' మహాశయు డంతటివాడై, దేశ పురోభి వృద్ధిని, క్షేమాన్ని తన భుజస్కంధాలపై వేసి కోవాలని భావించిన మామయ్య ఆశలు, చివుక్కు మన్నాయి, "తిలక్" పీఠబడి చదువునుకూడ వంట పట్టించుకోలేక 'అప్రయోజకుడుగా' తయారయ్యే పాటికి.

మామయ్యమనస్సు క్షణకాలం చివుక్కుమన్నా ఆయన ఆశలు రెండవవాడు కృష్ణుని మీదకు మళ్ళాయి; వాణ్ణి 'ఇంజనీయర్ని' చేయాలని సర్వ ప్రయత్నాలు జరిపారు. ఇంటర్ మీడియట్ చదువుతోన్న 'కృష్ణుని'కి ఎలాంటి ఇబ్బంది కలగకుండ సర్వసౌకర్యాలు కూర్చారు - 'మీవాడు కాలేజీలో చదువుతున్నాడట' అని నల్గురూ అన్ననాడు, పొంగిపోయారు మామయ్య - కాని ఆపొంగు అర్ధాంతరంలోనే ఆగిపోయింది. కృష్ణుడు గుంటూరులో ప్రక్కింటి లాయరుగారమ్మాయితో లేచి పోవటంతో.

నలుగురు ఈ విషయం చెప్పుకొన్ననాడు మామయ్య హృదయం కాలిన ఇనుములా మాడి పోయింది. మౌనంగా వుండిపోయారు.

పెద్ద అమ్మాయి 'కస్తూరి' ని దగ్గర బంధువుకే ఇచ్చారు మామయ్య—కానీ ఏంలాభం ? కస్తూరి జీవితంలో నిప్పులు పోసి, వివాహం అయి నెల తిరక్కముందే అల్లుడు దాటిపోయాడు—

కస్తూరి జీవితం బుగ్గి అయింది. సావిత్రి వివాహం చేసారు మామయ్య. ఆ సావిత్రి కళ్ళ ముందర లేకుండ మిలటిరీలో పనిచేస్తున్న భర్తతో షిలాంగ్ వెళ్ళిపోయింది; మూడు సంవత్సరాలకు, నాలుగు సంవత్సరాలకు ఒకసారికాని కన్పించదు.

మామయ్య ధర్మమూర్తి. దేశంకోసం త్యాగం చేసిన త్యాగమూర్తి...నలుగురి క్షేమాన్ని ఆశించిన వ్యక్తి — మనసా, వాచా ఇతరులకు కించిత్ హాని జరుగుతుండగా చూచి ఓర్వగల శక్తిలేని దయార్ద్ర హృదయుడు—

అలాంటి మామయ్య కుటుంబంలో ఈ అశాంతి ఏమిటి ? అందరికి మార్గదర్శకులై, వారి సానుభూతిని పొందగల్గిన మామయ్య తన సంతానానికి మార్గదర్శకులు కాలేకపోయారు ?

జీవితంలో తను ఆశించిన ఆశయాలు, ప్రాకాలనుకొన్న శిఖరాలు, అన్నీ చేతికి అందకుండా పోవటంతో ... మామయ్య హృదయం గాయపడింది. తన జీవితం సంధ్యలో ప్రవేశించిన, క్షణాలలో, అశాంతి తనను చుట్టుముట్టింది. నిరాశ వెంటాడింది ... కానీ ఈ అశాంతి ... ఈ గాలి దుమారం బాహ్యంగా కన్పించే మామయ్యలో ఎలాంటి మార్పును చూపలేకపోయాయి. ఆ గంభీరమైన విగ్రహం అలా గంభీరంగానే కన్పించింది.

"ఏమండి! మనం చేసిన పాపం ఏమిటి?" అని తిలక్‌ను, కృష్ణుణ్ణి, కస్తూరిని తలచుకొని అత్తయ్య కంట తడిపెట్టిననాడు—తొణకకుండా మామయ్య "ఇది ఇలాజరగాలి అనేది దైవేచ్ఛ....పిచ్చిదానా ! మనం వాళ్ళను బాగుచేయాలంటే చేయగలమా?... మన చేతుల్లో ఏముంది?—" అని ధైర్యం చెప్పేవాడు. అలా చెప్పగలిగినా.... సామాన్యులకు, అందనిబాధ మామయ్య మనస్సులో అతిగోప్యంగా సుడులు తిరుగుతుందా అనిపించేది.

ఆయన దృష్టిలో శేఖర్, సుశీల మిగిలివున్నారు. బి. ఏ. చదువుతున్న శేఖర్, మెట్రిక్ చదువుతున్న సుశీల, ఆయనకు కీర్తిని, ఖ్యాతిని తెచ్చిపెడతారనే ఆశ, విశ్వాసం ఆయనలో పెనవేసికొన్నాయి. ఆనాటికొరకు ఎదురుచూస్తూ జీవితయాత్ర సాగించారు మామయ్య.

సరిగ్గా రెండు సంవత్సరాలక్రితం నాకు ఇంజనీరు ఉద్యోగ మయింది ; "రేపు ప్రొద్దున వెళుతున్నాను మామయ్యా" అని చెప్పటానికి వెళ్ళాను.

"మంచిదిరా సత్తి"—"మనలో ఒక్కడివన్నా ఇంజనీరువయ్యావు...నీవలన మేమంతా గర్వించాలి..." అంటున్న మామయ్య కళ్ళలో ఏదో

అశాంతి, తనకు లభించని వస్తువుకోసం బాధలాంటి దేదో—క్షణమాత్రం లీలామాత్రం కన్పించింది.

నాకు ఉద్యోగం అయినందుకు ఆయన ఎంతగానో సంతసించారు.

ప్రభుత్వం...ఉద్యోగం... ఉద్యోగుల కర్తవ్యం వీటినిగురించి ఎంతోసేపు చెప్పారు. జీవితంలో ప్రవేశించి, ఆ జీవితాని కో రూపా న్నివ్వబోతున్న నాకు, మామయ్యమాటలు ఎంతగానో ఉపయోగించాయి.

మరునాడు వెళ్ళిపోయాను—

ఆనాటినుండి జాబుల్లోనే 'పాలెం' విషయాలు తెలిసేవి.

* * *

మామయ్య, ఎవరిమీద అయితే, తన ఆశలను కేంద్రీకరించారో, ఆ శేఖర్, తప్పత్రాగి బజారులో గోల చేయటంవలన పోలీసులు అరెస్టు చేసారని 'పాలెం' లో నలుగురు చెప్పుకొన్నారు—

పిడుగులాంటి ఈవార్త వినటంతోటే మామయ్య నిశ్చేష్టులయ్యారట. ఈ వార్తలోని నిజానిజాలను కనుక్కోవటానికి బస్తీ వెళ్ళిన మామయ్య శేఖర్ జైల్లో ఉన్నట్లు దృఢమయ్యేపాటికి ఖిన్నుడయ్యారట. సుశీలను తీసికొని ఇంటికి వెళదామని సుశీల, శేఖర్ వుంటున్న ఇంటికి వెళ్ళారు.

సుశీల ...

"నేను రాలేను నాన్నా! క్షమించండి; నా శీలం హరించిపోయింది. నేను గర్భవతిని—" అంది.

చుట్టూ వేలాది ప్రజావాహిని తనను చూచి వికటాట్టహాసం చేస్తున్నట్లు, తనను వేలెత్తి చూపుతున్నట్లు బాధపడ్డా రాయన. ఎక్కడో దూరంగా మినుకు మినుకు మంటున్న ఆశాజ్యోతి, పెనుగాలికి అంతర్హితమైపోయింది.

పెద్ద కొడుకు అప్రయోజకుడు.

రెండవవాడు తిరుగుబోతు.

మూడవవాడు త్రాగుబోతు.

పెద్ద అమ్మాయి అభాగ్యురాలు. రెండవ అమ్మాయి కంటికి కన్పించదు. మూడవది శీలం లేనిది, కళంకిని. ఇది తన సంతానం; మామయ్య 'ఆశలు' అడియాస లయ్యాయి.

* * *

అత్తయ్య చెప్పటం ప్రారంభించింది.

ఆనాడు పట్టణంనుండి ఇంటికి వచ్చారాయన; ఎవరితోను పలుకలేదు. మౌనంగా వున్నారు. సాయంత్రం ఏడు గంటలకు దేవుని గదిలోకి వెళ్ళి పూజ, జపం పూర్తిచేసికొని వచ్చారు.

"ఏమండి! ఏమిటీ అన్యాయం?" అన్నాను నేను, వికలచిత్తంతో—

"ఏముందే పిచ్చిదానా! అంతా లోకరీతి. ప్రపంచంలో ఒక్కొక్క రకమైనవాళ్ళ జీవితాలు ఒక్కొక్క విధంగా గడుస్తాయి. వాళ్ళ సమస్యలకు పరిష్కారమార్గం వాళ్ళ జీవితం అంతమయ్యేవరకు దొరకదు. ఆ జీవితం తెల్లవారాక, అన్ని సమస్యలు పూర్తిగా పరిష్కార మౌతాయి. అలాంటిదే నా జీవితము—" అన్నారు.

అలా ఒకటి, రెండుసార్లు అన్నారు. మొదటిసారి ఏదో మాట్లాడుతున్నారనుకొన్నాను, కాని ఆయన మాటల్లో ఏదో విపరీతార్థం గోచరించింది. ఆ మాటలలో, ఏనాడూ లేని 'నిరాశ' ధ్వనించింది. వారిలో విశ్వాసం సడలిపోయిందా అన్నట్లు వుందా చూపు.

"నాకు భగవంతుడు చెప్పాడు —నేను దాటిపోతే నా సంతానం బాగుపడి నా సమస్యలు పరిష్కార మౌతాయట" అన్నా రాయన.

"ఛ! అవేం మాటలండీ" అన్నాను.

నిట్టూర్చారు.

మరునాడే 'పిలాంగు' వెళ్ళి సావిత్రిని చూచి వస్తానని బయలుదేరారు. మానసికంగా క్రుంగిపోయిన, ఆయనకు, కొంత మనశ్శాంతి కలుగుతుందనుకొన్నాను.

పిలాంగునుండి పదిహేను దినాలకు తిరిగి వచ్చారు. ఎక్కడో 'కృష్ణుడు' కన్పించాడట, తిండి

తిప్పలకు మొహంవాచి, బికారిలా హీనంగా బ్రతుకుతూ;

నా మాతృహృదయం ఆక్రోశించింది. "రమ్మని తీసికొని రాకపోయారా" అన్నాను.

రమ్మనలేదు - కానీ కొద్దిరోజులలో తప్పక తిరిగి వస్తాడు. అది నా విశ్వాసం!" అన్నా రాయన.

ఏమిటో అంతా విపరీతంగా మాట్లాడారు. "సావిత్రిచేత నోము నోయించాను. నా జీవితంలో ఆఖరిసారిగా ఆశీర్వదించాను. నా చేతిమీదుగా పసుపు, కుంకుమ ఇచ్చాను - దానినిగురించి ఒకటే విచారం. అది తల్లి అయితే చూచిపోదామను కొన్నాను" అన్నా రాయన.

ఆనాటినుండి, ఆ దేవుని గదినుండి బయటకు వచ్చేవారుకారు. తనకోసం ఎవరైనావస్తే అతి క్లుప్తంగా మాట్లాడి పంపేవారు.

"నీ ఇష్టంవచ్చిన కొడుకుదగ్గర వుండు. లేదంటావా, నీకేం తక్కువ? ఈ ఇంటిలోనే వుండు, నేనిక వెళతాను—" అనేవారు. ఆయన ధోరణి వింటుంటే నాకు భయం వేసేది.

* * *

నాయనా! సత్యం! - ఆయన తపస్వి - భగవంతుడు ఆయన చెప్పుచేతుల్లో వుండేవాడు. మరణం ఆయన కోరినప్పుడు లభించింది _ మాఘ పౌర్ణమినాడు తన జీవితాన్ని తెల్లవార్చుకొని దాటిపోయారు.

అత్తయ్యకంఠం రుద్ధమైంది.

నాకంటినుండి అప్రయత్నంగా జలజలా రాలిపోయింది కన్నీరు. దేశానికి, ధైర్యంచెప్పిన మామయ్య; జీవితాంతం ప్రజాహిత కార్యాలకు కైంకర్యమయిన మామయ్య. ఆ దయామూర్తి - ఆ ప్రేమపూర్తి - ఆ నిష్కల్మషమూర్తి కళ్ళలో కన్పించినట్లైంది.

ఈగదిలోని, భగవంతుడే మీ మామయ్యను తీసికొనివెళ్ళాడు. మీమామయ్యకు చూపిన మార్గాన్ని, ఆభగవంతుడు, నాకూ, ఎందుకుచూపి, ముక్తి ప్రసాదించడు ? అందుకే ఆయన సన్నిధానంలోనే ఉంటున్నాను, నాయనా! అంది అత్తయ్య.

* * *

మామయ్య చనిపోవటంతో 'తిలక్' మీద పడ్డాయి బాధ్యతలు. వాటిలో సతమతమౌతూ, బాధ్యత కలవాడయ్యాడు తిలక్.

'కృష్ణుడు' ఆ పిశాచాన్ని ఎలాగో వదలించుకొని పశ్చాత్తప్త హృదయంతో కొంపచేరాడు.

శేఖర్పై కేసుపోయింది. బుద్ధిగా చదువుకొంటున్నాడు. సుశీల శీలాన్ని హరించిన డాక్టరు గారబ్బాయి, సుశీలను స్వీకరించి వివాహం చేసికొన్నాడు.

సావిత్రి గర్భవతి - పుట్టింటికి వచ్చింది. మామయ్య దాటిపోయారు. సమస్యలన్నీ వాటంతట వే పరిష్కరింపబడ్డాయి.

మామయ్య తపస్వి.

ఆయన తపశ్శాలి.

# అంతర్ముఖుడు | కుందుర్తి

తలమీద బరువు భారంగా మోస్తూ నడిచి
గండ కత్తెరవంటి కాలం ఎలాగో మెల్లిగా గడిచి
విడిచే ప్రతి నిశ్వాసం వేదనా శకలాలు చిమ్మి
ఆద్యంతాలు లేని యాత్ర మధ్యలో ఆయాసం గుండెలో క్రమ్మి

నమ్మే ప్రతి విశ్వాసంతో నాకం దూరమై తోచగా
వచ్చిన సరిక్రొత్త మార్పు రానిదాని కర్రులు సాచగా
వీచే ప్రతిమందానిలం కళ్ళల్లో దుమ్ము చల్లగా
పుట్టుకతో గ్రుడ్డివాడని లోకం కట్టుకథ అల్లగా

దృష్టులు పాదాలమీద లగ్నంచేసి దీనంగా నుంచుంటాను నేను—
ఏం తోస్తుంది మనసులో ఏది తోస్తుంది ముందుకు ?

౨

ఓడిపోయిన భూమీపతి వస్తువులన్నీ లాక్కొని
ఒక్కటే కోరుకోమంటే సింహాసనం అడిగినట్లు
బ్రతుకులో బందీగా కూచున్న నేను
పరమశాంతిని కోరుతాను.

శాంతి సింహాసనం మీద కూచోని
కాంతిచక్రాల కేంద్ర బిందువులు చూసి
నాలోని ఆ కాన్త వెలుగు నలుదిక్కులు క్రమ్మటం చూసి
ఏమీ లేదనుకున్న గగనంలో ఇంత పెద్ద సూర్యుణ్ణి చూసి
కంటికే కనిపించని గాలిలో గడ్డకట్టిన ప్రాణశక్తి చూసి
అంత చల్లని సముద్రంలో అడుగున బడబాగ్ని చూసి
తాకితే కాలే అగ్నిలో ప్రాకే చైతన్యం చూసి

భూమిమీద మొలిచే ప్రతి గడ్డిపోచను పిలిచి పలకరించి
కోట్లాది గడ్డిపోచలు నిర్మించిన ఆకుపచ్చని తివాసీ చూచి

నెలయేటి మొదటిలో పుట్టి జలధికి పయనం గట్టి
ఒయ్యార మొలుకుతూ నడిచే ఒంటరి బుద్బుద్ధం చూసి

అనంత కాలప్రవాహంలో తనంత మొనగాడు లేడని (!)
వసుధను కబళింపనెంచే వందఏండ్ల మనిషిని చూచి

లోపల కదిలే నవ్వులో జాలి సమమార్చుకుంటూ
ఆశా నిరాశల మధ్య వాలి యీదటం నేర్చుకుంటూ
దృష్టులు పాదాలమీద లగ్నంచేసి దీనంగా నుంచుంటాను నేను—
ఏం తోస్తుంది మనసులో, ఏదితోస్తుంది ముందుకు ?

3

చుట్టూ ముట్టడిస్తున్న శత్రువుల్ని చుట్టాలుగా భావనచేసి
కోటతలుపులు తెరచి గోడల పహరాలు రద్దుపరచి
కామాన్ని తల ఖండించి క్రోధం గొంతుకోసి
లోభాన్ని ఆరడగుల గోతిలో లోతుగా పాతి
మోహాన్ని జుట్టుపట్టుకుని మోటుగా నట్టేట ముంచి
పెంచిన మద మాత్సర్యాలు గల
నిఘంటువు పుటలను చించి—

నేను "నేను" గా కనిపించాలని
పూనిక మనసులో పెంచి
కంకులతో కళకళలాడే చేనుగా కనిపించాలని
మీ చేత ఢిల్లీ భోగాలు తినిపించాలని ;

సాహిత్య సరస్వతి నాలుకమీద
తేనెగా కనిపించాలని
లోకానికి అపూర్వ గీతాలు వినిపించాలని
పూనిక మనసులో పెంచి

దృష్టులు పాదాలమీద లగ్నంచేసి
దీనంగా నుంచుంటాను నేను.........

# సంపత్కుమార | చలం - పురూరవ

స్వతంత్ర వ్యక్తిత్వమూ, తాను సత్యమని నమ్మినదానిని ఖచ్చితంగా చెప్పగల నిర్భీకతా, [1]అనవరత సత్యాన్వేషణమూ కల, దేశంలోని ద్విత్రిసంఖ్యాకమయిన రచయితలలో ఒకడయిన 'చలం' వ్రాసిన నాటకం ఈ 'పురూరవ'. 'కవిత్వమొక తీరని దాహం' అన్నట్లుగా తీరని కళాదాహంతో అవిరళంగా వచనసాహిత్యంలో నైకరీతులను, అనిదంపూర్వ ధోరణిలో ఉద్ధృతంగా ప్రవేశపెట్టి విస్తృతమైన తన సాహిత్యాన్ని దేశానికి సమర్పించినాడు చలం. అతని రచనలలో అమితమైన శక్తి ఉన్నది, ఆ శక్తి అభ్యాస పాటవంవల్ల రచనలలో సంక్రమించింది కాదు,[2] వాస్తవం చెప్పడంవల్ల సంక్రమించింది. సదుద్దేశ్యంతో ప్రవేశపెట్టబడిన వివిధ సాంఘిక నిబంధనలూ, ఆచారాలూ, కృత్రిమములయి, భేషజములయి, కపటనిలయాలయినప్పుడు వాని మీద ధ్వజమెత్తిన చలం పొందినంత దూషణ దేశంలో మరెవరికీ లభ్యంకాలేదంటే, అతిశయోక్తి కాదు. ప్రేమ, శృంగారాల నాలంబనంగా తీసికొని, వానిచుట్టూ పెరిగిన, వెర్రితలలువేసిన చెడుమొక్కలను పెరికివేసే యత్నం చేసిన చలం దేశానికి, అర్థంకాలేదనే చెప్పవలసి ఉంటుంది. చలం ఇంద్రియోత్తేజకరమైన అతి తక్కువరకపు రచనలు, చేసి కీర్తి సంపాదించాడని దేశం అతన్ని నిందించింది. అతడు చెప్పిన విషయాలు, అతని రచనల్లో పొందిన క్రమవికాసాన్ని చూస్తే అతని తత్వం సంపూర్ణంగా అర్థమవుతుంది.

అతని అన్వేషణలో ప్రేమ - ఈశ్వరుడు సమానం.

ఈ ప్రేమ అనేది చాలా సున్నితమయిన విషయం. దీన్ని నిర్వహించడమనేది అతికష్టమైన పని. ఎందుకంటే ప్రేమ అనగానే దాన్నంటుకొని శృంగారమూ, దాన్ననుసరించి కామమూ, ఇవ్వన్నీ అనుకోకుండానే ఊహకు స్ఫురించడం జరుగుతుంది. కామ మనగానే నీచ ప్రక్రియగా వాచ్యంలో నిర్ధారితమవుతున్నది. అయితే స్త్రీ విషయికమయిన ప్రేమ రతితోనే ఆఖరవుతుందనేది అసంబద్ధం. కాని అది దానికి అంగభూతము మాత్రమే అవుతున్నది తప్ప అదే శేఖరీభూతం కావడంలేదు.[3] దీనిని మించిన ప్రేమఉన్నది. అది త్వరగా అర్థం కానిది. అయితే ఈ ప్రేమకు అవధుల్లేవనేది ప్రతివారూ ఒప్పుకొనే విషయమే. దీనికి నియమాలుండవు. అది ప్రసరించవలసిన, ప్రసరించరాని స్థలాలని గిరిగీయడానికి వీలులేదు. మనోదార్ఢ్యం దీనికి ముఖ్యమయింది. అప్పుడే ఇది నిర్వ్యాజమవుతుంది.[4] సవ్యాజప్రేమకన్న నిర్వ్యాజప్రేమ అత్యంతమూ ఉపాదేయమయినది. ప్రేమించలేనివాడు

---

1. 'సత్యమనేది ఉండనీ, ఉండకపోనీ, నేను ఏనాటికి ఏది సత్యమనుకున్నానో దాన్ని అనుష్ఠించకుండా నిలువలేను. ఏది సత్యం ? ఏది ధర్మం ? అని యోచించకుండానూ నా మనసును కట్టుకోనూలేను (మ్యూజింగ్స్. భా. 3. పే. 230.)' అంటాడు చలం.

2. నేను వ్రాసేది సరికానీ, కాకపోనీ, నా వ్రాతకి శైలినీ, బలాన్నీ ఇచ్చేది వాస్తవత్వం. ... నన్ను వేరుగా, నా పద్ధతుల్ని వేరుగా, నేను వ్రాసే విషయాన్ని వేరుగా చూడడం పొరబాటు. నేను నమ్మినవాటినే వ్రాశాను. వ్రాసినవాటినే ఆచరించాను.... తప్పైతే వ్రాతలు, పద్ధతులూ, నేనూ, అన్నీ తప్పే. (మ్యూజింగ్స్. భా. 2. పే. 59).

3. "—అనంతంగా నాజీవితంలో ప్రతినిమిషం ప్రేమించమని అడగడంలేదు. అది అత్యాశ.... పోనీలే. ఒక స్త్రీ నన్ను జీవితమంతా ప్రేమించాలంటే, అది కష్టం. అది పోనీ, ఒకే యువతి అక్కరలేదు. కాని ఎవరో ఒకరు. ఎవరో అమ్మాయి, అబ్బాయి, దిక్కులేని కుక్కపిల్ల, ఏదో మృగం— నన్నుచూసి తోకాడించే కుక్క, నేను తాకితే సంతోష పడేది, తనకళ్ళల్లో ఆత్మపెట్టుకుని నన్నుచూచేది, నావెంటరాకుండా నిలువలేనిది, అది కావాలి నాకు—" రామ్మూర్తి ఉత్తరం. (మ్యూజింగ్స్. భా. 2. పే. 23).

4. 'దళముగ గుండె వ్యాజరహితంబగు ప్రేమనె కోరుచుండు, నిశ్చలమతి సీతయున్ శ్రమణి సాగెదరాగతి—' (రామాయణ కల్పవృక్షం-సుందర).

'ఎదుగ' లేదు. ఎవరు మానసికంగా ఎదుగలేదో వారు ద్విపాత్తు మాత్రమే. ఇత్యాది విషయాలే చలంయొక్క ప్రేమతత్వానికి మూలభూతాలయినవి. వీటిని వ్యక్తీకరించడం కోసమే చలం సాహిత్యసృష్టి అంతా. ఆ సృష్టియొక్క పతాకాఘంటికే 'పురూరురవ'.

చలం తనరచనలలో పూర్వగాథల్ని స్వీకరించి, స్వదృక్పథంతో వాటికి క్రొత్తరూపాలను తొడిగినాడు. పూర్వగాథలకీదృగ్విధమయిన వ్యాఖ్యానం అనూచానంగా ఉన్నదే. సామాన్యంగా సాహిత్య సృష్టి అంతా తత్తద్రచయితల ప్రాపంచిక, సాంఘిక, ఆధ్యాత్మిక దృష్టినిబట్టే ఉంటుందిగాని అన్యథా ఉండదు. దీనికి ఉదాహరణగ 'పురాణ' సాహిత్యాన్ని తీసికోవచ్చును. నాలుగయిదు పురాణాలలో ఒకేగాథ వివిధ రూపాలను స్వీకరించి ఉండడం జరుగుతున్నది. కాళిదాసు భారతంలో అనుదాత్తనాయకుడుగా ఉన్నాడనుకొనబడుతున్న దుష్యంతునియొక్క గాథను 'అభిజ్ఞానశాకుంతల'గా వినూత్నీకరించినాడు. కీచక పాత్రయందు, భారతంలోని కుత్సితత్వం విశ్వనాథవారి నర్తనశాలలో ఉదాత్తస్వరూప పరిప్లుతమయింది. చలంకూడా ఇదేపద్ధతిలో భానుమతి, చిత్రాంగి, సావిత్రి, జయదేవ, శశాంక, పురూరవల్ని వ్రాసినాడు. చలం భావౌన్నత్యం క్రమక్రమ ప్రవర్థితస్థాయినందుకొంటూ పురూరవలో పరిపక్వస్థితినందడం మనం గమనించవచ్చు.

వీటన్నిటిలో వక్తవ్యం ఒకటే అయినా, వివిధ దృక్కోణాల్లో వ్యవస్థితమయి పురూరవలో ముఖ్ళువేసికొన్నది. ప్రేమకు క్షమ ముఖ్యమయినది. ఇక్కడ ఒకటి స్మర్తవ్యమున్నది. తన పుత్రశత నాశానికి కారణమయి, అనేకమైన ఇతర బాధల్ని కల్పించిన విశ్వామిత్రుని ఎడ వశిష్ఠుడు క్షమాగుణం నెరపి, అతనికే- ఆ బద్ధశత్రువు వంటి వానికే బ్రహ్మర్షిత్వం ప్రసాదించినందుకు అతడు కీర్తితుడయినాడు. ఆ క్షమాగుణాన్నే మరొకరూపంలో బృహస్పతియందు 'శశాంక' లో- ప్రేమవల్ల తన భార్య తార, తన శిష్యుడు శశాంకుడు ఏకీతులయినప్పుడు, దండించకుండా క్షమ నెరపినట్టు చలం చెప్పితే అది దూష్యమయింది. గుణ ప్రాధాన్యమున్న యీ విషయంలో స్వ నిర్ధారిత పూర్వవిషయ వైరుధ్యం స్ఫురించినందుకు గాను చలం దూష్యుడయినాడు. ఇది ఆలోచనా పద్ధతిలోని లోపం. వశిష్ఠుని క్షమాగుణ ప్రతిపాదనకు మించిన సౌజన్యం బృహస్పతిలోని క్షమాగుణాని కుండడం అసహ్యకారణ మవుతున్నదా? కావచ్చు.— ఈ విధంగానే ఆ యా నాటకాలలో ప్రేమ యొక్క వ్యక్తిత్వం ఇతర బంధ విరాపక రూపంలో చిత్రితమయింది.

ప్రస్తుతం పురూరవ నాటకం—

ఆధునికంగా వచ్చిన నాటకాలన్నీ దృశ్యాలు కావాలనే ఉద్దేశ్యంతోనే వ్రాయబడ్డా, కొన్ని రంగానికనువుగా ఉండడం లేదు, కొన్నిటికి రంగమే అనువుగా ఉండడంలేదు. రంగస్థలపు కూర్పుల్లో నేర్పు ఇంకెంతో దేశంలో రావలసిఉన్నది. అయితే రంగస్థలానికి ఆ అభివృద్ధి వచ్చినా, ఈ పురూరవ ప్రదర్శించడానికి వీలుకానిది. అదీగాక, దీనిలో కథకు ప్రాధాన్యంలేకుండా [5] తత్వప్రాధాన్యం ఉండడంవల్లా, అద్యంతమూ చార్చికంగా నడవడంవల్లా ఇది ప్రేక్షకుల కందుబాటులో ఉండదు. చలం చెప్పిన పరిసరాల్ని ఊహించుకుని శ్రవ్య కావ్యరూపంలో చదువుకోవడంలోనే పాఠకు డానందాన్ని పొందుతాడు. చలం దీన్ని 'నాటకం' అన్నాడుగదా అని దీనిలో నాటక లక్షణాలను వెదకితే అవి మృగ్యం. చలం యొక్క [6] ఇతర నాటకాలవంటిది కాదిది. నాటకాల్లో వాచికానికీ, ఆంగికానికే ప్రాధాన్యం ఉంటుంది. మనోభావాలని ఆంగికమయిన నటన ద్వారానే వ్యక్తంచేయాలి. ఆ వ్యక్తం చేయబడింది వాచికం ద్వారానే శ్రవ్యం కావలసిఉంటుంది. కాని రచయిత మధ్యలో కల్పించుకుని విపులీకరించడం నాటక రచనాపద్ధతికి విరుద్ధం. ఉదాహరణకి ఊర్వశీ పురూరవుల ప్రథమ సమాగమ ఘట్టంలో ఒక విషయం —

పురూరవుడు : ఎందుకు వొచ్చావు ?

ఊర్వశి : నీకోసం.

ఇక్కడ రచయిత చటుక్కున కల్పించుకుని 'పురూరవుడు ఏమంటాడు ? ఊర్వశి - దేవత. ........ లోక పరత్వంలో, రాజకీయాల్లో ఆరితేరిన పురూరవుడికి ఆమెలోని సత్యం, సహజత్వం ఎలా అర్థమవుతాయి ? .......... కొంత సత్యాన్వేషణ చేసిన మనిషి గనక, అతని శృంగార జ్ఞానం ఆమెని విరాకరించలేక పెనుగులాడుతోంది' అంటాడు. ఈ దృశమయిన వివరణ నాటక రచనా పద్ధతికి విరుద్ధం. అక్కడ రంగంమీద నటకు డే భావం అనుకరించాలో అదే సంగ్రహంగా చెప్పవలసి ఉంటుందిగాని ఈ దృక్ వ్యాఖ్యానం ఉండగూడదు. కాబట్టి ఈ 'పురూరవ' ను 'సంభాషణా శ్రవ్య కావ్యం' అనడం ఉత్తమ పద్ధతి అవుతుంది. దీనిలో కాలైక్యత లేదు. రంగైక్యత కూడా తక్కువే. ఈ కాలైక్యత లేకపోవడం నాటకాన్ని పెద్ద దెబ్బతీస్తుంది. కాని తీసుకున్న

5. 'ప్రబోధ చంద్రోదయం' ఇత్యాదులలో తత్వానికి కథకూ సమానంగా ప్రాతినిధ్యం ఉంది కాబట్టి అవి ప్రదర్శించబడుతున్నవి.

6. త్యాగం, చిత్రాంగి, భానుమతి, మొదలయినవి కొన్ని రంగస్థలానికి అనువయిన నాటకాలూ, నాటికలూ ఉన్నాయి.

గాథను బట్టీ, నిరూపించదలచిన విషయాన్ని బట్టీ ఆ కాలైక్యత కుదురలేదు. కాబట్టి అది తప్పనిసరి అయింది. ఈ నాటకం (నాటకమనే, దీన్ని వ్యవహరించడం ప్రస్తుతం జరుగుతుంది.) రెండే రెండు పాత్రలతో ఆద్యంతమూ నడుస్తుంది. ఇంతే అయినా చదవడంలోని ఔత్సుక్యమూ, ఆనందమూ ఏమాత్రం తృప్తిని పొందవు. రచయితయొక్క అల్పిష్టములూ, దీర్ఘములూన్నూ అయిన మధ్యేపతిత వ్యాఖ్యానాలూ పాఠకుణ్ణి త్వరత్వరగా ముందుకు నడిపింపచేస్తాయి.

భాషా విషయికంగాచూస్తే చాలా ఉద్ధృతంగానూ, విచిత్రంగానూ ఉంటుంది. అది 'చలంముద్ర'. ఆయన ఎల్లా మాట్లాడితే అల్లానే వ్రాస్తాడనిపించుతుంది. [7]"నిత్యవేగి నా చేతము, శబ్దమేరుటకు చిన్నము నిల్వదు భావతీవ్రతన్" నితభావరుహీవేగ వికృష్యమాణమయిన ప్రతి బుద్ధీ ఇంతే. అందుకనే వాక్యంకన్న ముందు భావం పరుగెత్తి, వాక్యాన్ని అస్తవ్యస్తం చేస్తుంది చలం రచనలో. ఉదాహరణకి ఊర్వశి అనే ఈ వాక్యం చూడవచ్చు :

'నీ కర్థం కాదు అప్పుడే. చూడు నేను కాక నీకేమన్నా ముఖ్యమై. నానించి ఆలోచించావా, చాలా దురదృష్ట వంతుడివి.'[8]

ఈ వాక్యం :

'నీ కర్థం కాదు అప్పుడే. చూడు, నాకన్నా నీకు మరోటి ముఖ్యమై, నన్నుగూర్చి గాక, దాన్ని గూర్చి ఆలోచించావా, చాలా దురదృష్టవంతుడి వన్నమాట.'

అని ఉండడంలో ఎక్కువ స్పష్టత ఉంది. 'నానించి ఆలోచించావా' అంటే 'నానుండి విడిగా = నేను గాక వేరే' అని అర్థం చెప్పుకోవలసి ఉంటుంది. దాదాపుగా ఇల్లాగే చాలాచోట్ల చూచుకోవలసి ఉంటుంది. అయితే ఇవన్నీ పాఠకుడివి, ముందుకు వెళ్లడంలో అడ్డకిపోవడమే ఒక విశేషం. దానికి కారణం చలం రచనలోని వేగం, భావంలోని తీవ్రతాన్నూ. మనస్సు దాన్ని తట్టుకుని ముందుకు సాగుతుందే కాని వీటికోసం ఆగదు. ఆగిందా, భావ తీవ్రత మందగించిం దన్నమాట. అది చలంలో ఎక్కడా లేదు.

విష్ణు పురాణమూ, భాగవతము ననుసరించి ఊర్వశి పురూరవుడిని వదలడంలో—అంటే ఊర్వశి శాపం అంతం కావడంలోని కారణం ఒకటి ఉంది. అది ఊర్వశి పుత్ర నిర్విశేషంగా ప్రేమించుకొంటున్న రెండు గొర్రెలను పురూరవుడు రక్షించాలి. ఆ రక్షణలో లోపంవస్తే ఊర్వశి పురూరవుణ్ణి విడుస్తుంది. నగ్నుడుగా పడకమీద కాకుండా—కనిపించితే విడుస్తుంది. కాళిదాసు ఈ శాపాంతాన్ని ఊర్వశికి పుత్రముఖ దర్శనంతో కలిగించినాడు. చలం మాత్రం ఈ విషయంలో కాళిదాసుకు గాక పూర్వగాథలనే కొంత అనుసరించినాడని 'చెప్పవచ్చు' ననడం ఎందుకంటే ఆరెండు నిబంధనలూ సక్రమంగా ప్రవేశబెట్టి, అనుకరించలేదు కనుక.

తన గొర్రెలయందు శ్రద్ధచూపనందుకు, తన నియమాన్ని అతిక్రమించినందుకూ ఊర్వశి పురూరవుడిని విడుస్తుంది. అంటే తానేవిషయంలో అతన్ని నియమించిందో, అందులో అతడు ఇముడలేకపోయినాడన్నమాట. ఉత్తీర్ణుడు కాలేకపోయినాడన్నమాట. అనగా స్వాధికమయిందేదో అతన్ని తద్విధంగా ఉల్లంఘితుడినిగా చేసింది కాబట్టి, తన అప్రాముఖ్యము కనుపించగనే అతన్ని వదిలింది. ఇదే చలం తన పురూరవలో నిరూపించిన విషయం. ప్రేమకి సర్వాత్మనా—బాహిరంగా, ఆంతరంగా— తనను అప్పనమిడితేనే ఆ ప్రేమకి తా నర్హుడవుతాడు. ప్రేమ ముందు, అహంకారమూ, మమకారమనే వేవీ ఉండడానికి వీల్లేదు అవే ఉండినట్టయితే లోపం ప్రేమలో తప్పకుండా గోచరిస్తుంది. ఆ లోపంవల్ల ప్రేమాలంబనం చేజారి పోతుంది. చలం పురూరవుడు ఒకానొక సమయంలో స్వగతమయిన 'అహం' ఉనికి, ప్రేమకి లోపం కలుగజేయడంవల్ల ఊర్వశిని పోగొట్టుకుంటాడు. [9]ఎవడో ఊర్వశిని చంపుతాడని, తా నతన్ని వధించి ఊర్వశిని రక్షించడం ధర్మమని, విధి అనీ ఆవిడ నిరాకరిస్తున్నా, నివారిస్తున్నా, ఆగకుండా 'అతన్ని' చంపినాడు. ఎప్పుడయితే లౌకిక భ్రాంతి మూలకాలయిన 'అహం' 'ధర్మం' 'విధి' ప్రేమకన్న, ప్రేమాలంబనంకన్న ఎక్కువగా స్వాయత్తీకరించుకున్నాయో, ఊర్వశి అతన్ని వదిలివేసింది.

అయితే ఊర్వశి క్షమించలేదని, లేనిదనికాదు, దయాహీన అనిగాదు. [10]ఈచిన్న అపరాధానికి అతన్ని వదలివేయడంలో, అతన్ని ఉన్నతస్థాయికి చేర్చేయత్నమే తప్ప మరేమీలేదు. అందుకనే ఊర్వశి అంటుందీ :

7. విశ్వనాథ సత్యనారాయణ రామాయణకల్పవృక్షావతారిక.

8. పురూరవ. పే. 29.

9. పురూరవ. పే. 126, 127, 128.

10. శిక్షవల్ల లోకపారిశుద్ధ్యం ఏనాడైనా జరుగుతుందా ? (పే. 73.) ....ప్రేమించు సమస్తజీవుల్ని ప్రేమించి, నీకన్న, నీ తపస్సుకన్న, నీ భార్యకన్న, నీ ఈశ్వరుడికన్న అధికంగా........ ప్రేమించు. ఖండించకు, శిక్షించకు. (పే. 76 శశాంక.)

[11]"దిక్కులదిరేట్టు 'ఊర్వశి' అని ప్రశ్నలడుగు, సాధించు........ నన్ను పొందగలిగిన ఔన్నత్యం ఎట్లాగో తెచ్చుకొన్నావు కొంతకాలం. అంత ఔన్నత్యాన్నీ మామూలుగా నీస్వభావానికి తెచ్చుకోగలగాలి నువ్వు. దానికోసమే ఇన్నియేళ్ల దారుణతపనం. నమ్ము. శిక్ష అనేది సృష్టిలో లేదు— దయతప్ప........' అని.

అంటే ఉన్నతమయిన ప్రేమానుభవం కొరకు, అలౌకిక వ్యామోహాలన్నీ త్యజించిన, వాటి నతిక్రమించిన ఔన్నత్యం పొందవలసి ఉంటుంది. లేకుంటే ప్రేమ ననుభవిస్తున్నామను కొనే భావం భ్రాంతిజన్య మవుతున్నదన్నమాట. అసలు లోకంలో సహజ, స్వతస్సిద్ధమైన దానివల్లకన్నా, —దాని ప్రతిబింబం, లేక దాని భ్రాంతి స్వరూపంతోనే ఆనందాధిక్యం అనుభూతమవుతూ ఉండడం ప్రస్తుతం గమనీయం. అచ్చమయిన ఆనందం కరువయిన ఈకాలంలో 'ఆనందవల్లి' లో పేర్కొనబడిన [12]మానుషానందాన్నే మనం ఊహించుకోలేని స్థితిలో ఉండడం జరుగుతున్నది. ప్రస్తుత భ్రాంతిజన్యమైన ఆనందమే 'అది' అని అనుకున్నట్లయితే తదానందవల్లీ కర్తలు చెప్పదలచుకొని— చెప్పలేకపోయిన పరబ్రహ్మానందం ఈనాడు ఉన్నత ధనవంతు లనుభవించే లాలసా సుఖం అని చెప్పటంలో ఏమీ సందేహించ నవసరం ఉండదు. ఆనందం అనేది బాహ్యవస్తు గుణాశ్రితమయింది కాదు. ఆంతరిక భావాశ్రితమయింది. ఆనందం [13]వస్తుగుణాశ్రితమే అయ్యేట్టయితే, సర్వులకూ, సర్వవేళలా ఆనందం తత్తద్వస్తు మూలకంగా కలగవలసే ఉంటుంది. కాని ఈవిధం లోకంలో దృశ్యమానం కావడంలేదు. తత్తత్పరిస్థితులలో, తత్తద్వ్యక్తి దృష్ట్యనుపాతంగా తత్తద్వస్తుసముదాయం ఆనందహేతుక మవుతున్నది. కాబట్టి బాహిరసన్నివేశాలకన్నా, ఆంతర స్థితియే ఆనందస్పందక మవుతున్నది. అప్పుడే అది అచ్చమయిన ఆనందమవుతుంది. ఈ అచ్చమయిన ఆనందం, లౌకిక వ్యామోహాలు విడిచి— వాటన్నిటి విషయంలో విర్లిప్తుడయి ఉన్నవాడికే అది లభిస్తుంది. అల్లాంటివాడే ఋషీ సంయమీ అవుతాడు. ప్రేమ ఆనందస్వరూపము కాబట్టి, అచ్చమైన ప్రేమికుడు అచ్చమయిన ఋషి అవుతాడు. ఆత్మ ఏకాగ్రమై భగవద్భావమందు, అనితరమందువలె, ఎవ్విధంగా లగించుతుందో, ఆవిధంగానే భగవద్భావమయిన ప్రేమయందూ లగించవలసి ఉంటుంది. ఈప్రేమ ఉద్బుద్ధికి కారణం 'ఒక'టని ఉండదు. అది స్వయంభువు. దానియొక్క ఎదుగుదలకు అతని స్వంత అనుభవమే సహాయక మవుతుంది. అందుకనే ఊర్వశి అంటుంది——

'క్రమంగా కాలంలో స్వంత అనుభవం బోధించవలసిందే. మాటలతో నేర్చుకునే విషయాలు చాలా అల్పమైన వన్నమాట [14]ఎదుగు విశాలంగా, తెలుస్తాయి. తెలీడమంటే అర్థమేమిటనుకున్నావు? అనుభవించే అర్హత కలగడమన్న మాట....' అని.

ఈ ఎదగడమనేది బాహిరప్రేరణవల్ల జరిగేదికాదు. [15]బలవంతంగా బాహిరంనుండి లభించేది వ్యక్తికి బాధాకరమే అవుతుంది. అందుకని తన మనస్సులోంచి తానే కట్టుకు రావాలి. [16]ఈ సుఖదుఃఖాలన్నీ మన మనస్సులోనే ఉన్నాయి. దాన్నే [17]ఆ మాలిన్యామాలిన్యాలనే సర్వత్రా మనం చూస్తూ ఉండడం జరుగుతుంది.

---

11. పురూరవ. పే. 138, 140.

12. నైషాఽఽనందస్య మీమాంసాభవతి. యువాస్యాత్సాధు యువాఽధ్యాయకః. ఆశిష్ఠోద్రఢిష్ఠో బలిష్ఠః. తస్యేయం పృథివీ సర్వా విత్తస్యపూర్ణాస్యాత్. స ఏక మానుష ఆనందః. (సాధుయువకుడు, సాంగాధ్యయన మొనర్చినవాడు, ఎట్టి పనినైనను అవలీలగా చేయువారిలో శ్రేష్ఠుడు, ద్రఢిష్ఠుడు, బలిష్ఠుడు, జగమునంతయు ఏకచ్ఛత్రాధిపత్యముగ నేలునట్టి సార్వభౌముడు—అట్టివానికిగల యానందము ఒక మానుషానంద మనబడును.)

13. తనలోతాను సౌఖ్యపడగలవాడు బైటసౌఖ్యాలకి దేవుల్లాడడు. తనలోతనకి సామరస్యం కుదరనివాడికి బైట ఎన్ని సౌఖ్యాలున్నా వృధా. (మ్యూజింగ్స్. భా. 3. పే. 173).

14. విశాలత్వమంటే అన్నివేపులా అందంగా పెరగడం. అంతేకాని ఓవైపు వెర్రితలలు వెయ్యడం కాదు. (మ్యూజింగ్స్. భా. 2. పే. 55).

15. తన స్వంతసుఖాన్ని తనలోపల్నించి కట్టుకోవాలి మానవుడు.... తన సుఖానికైనాసరే, బలవంతంగా ఒక ఏర్పాటుచేస్తే దాంట్లో సలుపడు. బాధకైనాసరే, అతనికి స్వతంత్రం కావాలి. (మ్యూజింగ్స్. భా. 2. పే. 131).

16. ఈసుఖాలన్నీ ఎక్కడేదికాయని మనస్సుల్లోగాక. (మ్యూజింగ్స్. భా. 2. పే. 185).

17. ఇతరులలో కనబడే మాలిన్యమెప్పుడూ హృదయదర్పణాలమీద ప్రతిబింబితమైన స్వీయకల్మషమే. (పే. 6. శశాంక.)

చలం సాహిత్యం ఇంద్రియోద్రేక కారకమైందనే భావం వ్యాప్తమయి ఉండడం నిజమే కాని అది అవిచారకమూలకం. ఆత్మికమయిన ప్రేరణకు సాంఘికములూ, అనర్థములూ– అర్థం మాని బూజెక్కినవి– అయిన నిబంధనలు ఉండవు అనే భావాన్ని విస్తరించడానికిగాను స్పష్టమయిన సాహిత్యాన్ని చదివి, ఆ భావాన్ని వ్యక్తీకరించే భాగాలు చదివీ, మరవడంవల్ల ఇల్లాంటి ప్రథ ఏర్పడింది. సాంఘికమయిన అనేక నియమ, సంప్రదాయాదులు పరిణామ దుష్టములయినప్పుడు, ఆ దుష్టత్వం తీసివేయడానికి చేసిన యత్నంలో, ఆ నియమ, సంప్రదాయాదులూ మాసిపోవడం జరిగింది. అంటే ఆ దుష్టత్వం అంతగా ప్రవర్థితమైన దన్నమాట. 'నాతి చరా' మీత్యాది ప్రతిజ్ఞలద్వారా ఏర్పడిన పవిత్రబంధం, నిర్బంధంగా మారి ఎంతగా ప్రస్తుతం దిగజారిపోయిందో, విచారించుకుంటే ఈ విషయం చాలా త్వరగా బోధపడుతుంది. ఉభయధా సన్నికృష్టమయిన భావమేఉంటే దాంపత్యం 'స్వర్గ' మవుతున్నది, కానిచోట్ల 'నరక' మవుతున్నది. మనస్సు అపరిపక్వంగా ఉన్న సమయంలోనే బంధనాలు ఏర్పడడంవల్ల, ఆ మనస్సు కృత్రిమంగా వికసింపజేసే యత్నం జరిగి, వికసించకుండానే సర్వే సర్వత్రా—అపవాదాలు అన్నిటికిమల్లేనే దీనికీ ఉన్నాయి—జరగడం దృశ్యమాన మవుతుంది లోకంలో. అప్పుడది, దాన్ని నిర్వర్తించుకోవడానికి దాసత్వం నెరపబడ్డట్లు ఉభయధా మారితే ఆ దాంపత్యం 'అనర్థం' కాకుండా సార్థం ఎల్లాగవుతుంది? ఈ దృగ్విధ విరూధ సిద్ధాంతాలకు లొంగక స్వవ్యక్తిత్వంతో నిలబడ్డ చలం 'అనర్థుడు'గా భావ్యమయినాడు.

ప్రేమకి [18]కామం ఒక అంగమే కాని, తద్విరహితంగా ప్రేమ ఉండదనేది, అసంభావ్యమూ, అసంబద్ధమూ అని పూర్వమే వ్యక్తీకరించబడింది. మొదట ఊర్వశి పురూరవుడి దగ్గరికి వచ్చినప్పుడు పురూరవుడు కఠినంగా మాట్లాడే సందర్భంలో వ్యాఖ్యానప్రాయంగా చలం–

'మామూలు మోహరీతులకి అలవాటయిన అతని మనస్సు, ఆమె నిశ్చల తన్మయత్వాన్ని అనుమానిస్తోంది. వెరపునీ, వంకర్లనీ, కామాన్నీ, అవసరాల్నీ, ఎరగని ప్రేమ అతనికి అర్థంకావడంలేదు.' అంటాడు. (పురూరవ - పుట 12.) కామ ప్రవృత్తికి త్వరచూపించిన పురూరవుడితో ఊర్వశి 'పాపం, అదొక్కటే గావును నీకు సౌందర్యాన్నించి ఆనందం తీసుకునే విధం......నీతో ఉన్న ప్రతి నిమిషం నీనించి గొప్ప గొప్ప తృప్తి ననుభవిస్తున్నాను ......ఆ సౌఖ్యం చాలా స్వల్ప విషయం....సౌందర్యానికి, ఆ కలయికకీ సంబంధమేమిటి? అది కామబలం, సృష్టి శక్తి చేతుల్లోకి తీసికొని, ఆడిమి. తాగి, కళ్ల ఆవేశంతో రక్త విజృంభణంతో మనస్సు పొరలుగప్పి—ఆ నిమిషాన సౌందర్యంతో ప్రసక్తి ఏముంది? సౌందర్యాన్నే అనుభవించడం నేర్చుకున్ననాడు స్వర్గమే నీ కరతలామలకం. (ఆ సౌందర్యానుభవం నేర్చుకోవడం) అదో విద్యకాదోయ్. ఎదగాలి ఆ జ్ఞానంలోకి' అని అంటుంది. (పురూరవ - పుట 56)

ఇంకా ఇల్లా అంటుంది :

"ఈ శరీరాల కలయికతో రక్త సంబంధంతో నా శక్తి, నా జ్ఞానం, నా స్పష్టత, నీలోకి రావాలి. ఉత్త కామవాంఛ తీర్చుకోవడ మనుకోకు. నీ ఆలింగనంలోకి అపురూప దేహ లావణ్యాన్నే కాదు. గొప్ప సంస్కారాన్నీ, విశాల విజ్ఞానాన్నీ, ఆధ్యాత్మిక శక్తినీ తీసుకుంటున్నావు. నీ ఆత్మ వికసించలేక పోతే ఈ సృష్టిలీలే అర్థవిహీనం వ్యర్థం" అని. (పురూరవ - పుట 61.) [19]ఆధ్యాత్మిక శక్తి అంటే మహోన్నతమైన [20]శృంగారకలాపమని చలం అభిప్రాయం. తీవ్రమయిన ఏ అనుభూతి అయినా ఆధ్యాత్మికమవుతూ ఉంటుంది–ఆత్మకు సంబంధించింది–అవుతుంది. ఆ తీవ్రానుభూతి లేనినాడు అనుభూతి కేవలేంద్రియ మాత్ర పర్యవసాయిగా అవుతుంది. మరి అది అవాంఛనీయమయిన విషయం గదా.

'శృంగార కలాపం' అనే మాట ఒక నిశ్చితమైన అర్థంలో ప్రరూఢమయి ఉంది లోకంలో. భాషలో కొన్నికొన్ని పదాలు కొన్ని నియమితమైన అర్థాల్లోనే పర్యవసించిన కారణంగా, ఆ పదాలు తమ స్వతశ్శక్తిని కోలుపోతున్నవని చెప్పవలసి

18. నా ప్రేమలో సంభోగానికి ఎక్కువ ప్రధానమైన స్థానంలేదు. సంభోగంవల్ల కలిగిందానికన్నా, ఉన్నతమైనదీ, తృప్తినిచ్చేదీ, ఏదో (దానికి పేరులేదు) ఇస్తాను, తీసుకుంటాను. అది ఆ ప్రత్యేకమైన విలువ సంభోగకార్యానికి, గొప్ప గాఢత్వాన్నీ, రసికత్వాన్నీ, అందాన్నీ, ఇంకా నువు ఒప్పుకుంటే నిర్మలత్వాన్నీ ఇస్తుంది. (చలం ఉత్తరాలు. ఉత్తరం-153).

19. ఆధ్యాత్మిక యత్నమంటే నా ఉద్దేశ్యం, హద్దులూ, లోపాలూ లేని తీవ్రమైన, నిరంతరమైన శృంగారకలాపమని. (మ్యూజింగ్స్. భా. 3. పే. 289). ఆధ్యాత్మికత అంటే, ప్రపంచంలోని అందానికీ, ఆనందానికీ కళ్లు తెరవడం. (మ్యూజింగ్స్. భా. 2. పే. 78).

20. ఈ సృష్టిసంబంధమైన విషయాలు వాళ్ళమనసుల్లో పిచమన్నా అయిపోయి ఉండాలి, లేక కామాన్ని శృంగారం కింద మార్చుకొనే శక్తిలేకపోయి ఉండాలి. (మ్యూజింగ్స్. భా. 3. పే. 289).

వస్తున్నది. శృంగారకలాపం అనగానే మామూలుగా సంభోగ వ్యాపారం అనే భావం కలుగుతుంది. కాని చలం ఉద్దేశ్యం అది కాదు. సౌందర్యానుభవం గూర్చి ఏదయితే చెప్పాడో అదే 'శృంగార కలాపం' అనే దానికి అర్థం. ఈ మాట కాకుండా చలానికి వ్యవహారగతపదం మరొకటి దొరక లేదు. మరొక మాట ఉపయుక్తమయితే, తద్భావనలో అది అనుపయుక్తపూర్వం కావడంవల్ల అసలు భావమే అవ్యక్త మయ్యే స్థితి ఏర్పడుతుందేమోనిపిస్తుంది.

ఈ నాటకంలో పురూరవుడు — మహాశౌర్యవంతుడు, కీర్తిమంతుడు, అతిలోకసుందరుడు, సర్వశాస్త్రకళాప్రవీణుడూ అయిన ఒక మానవ చక్రవర్తి. తన మహాన్వేషణలోని వ్యక్తి పురూరవుడని ఊర్వశి తెలుసుకొని ఇతన్ని కలుసుకో తలుస్తుంది. 'ఏదో' [21]శాపం అనే దారి చేసుకుని ఇతన్ని కలుసుకుంటుంది. మానవత్వంలోని అల్పిష్ఠ గుణాలతని లోని వామెకు అతనిపై కనిగలిగించినా, దానివల్ల జాలిపడి, దయతో అతన్ని అచ్చపు ప్రేమను తెలుసుకోనేట్లు చేయ యత్నిస్తుంది. అతడూ ఆమెవల్ల చాలా 'ఎదిగి' నాడు, కాని పూర్ణత్వం సిద్ధించలేదు. అతనిలో ప్రేమకన్న మరొక మనః ప్రోద్బలంయొక్క ప్రాముఖ్యం కనుపించడంతో అతన్ని ఆమె వదిలివేస్తుంది. సంక్షిప్తంగా ఇది గాథ. దీనిలో ఊర్వశి అనుభవరూపంలో చిత్రిత కావడంవల్ల పురూరవుని [22]'ఎదుగుదల'కు ప్రాధాన్యం కలిగింపబడడంవల్ల దీనికి చలం 'పురూరవ' అనే పేరు పెట్టాడని తోస్తుంది.

ఈ నాటకంలోని ఆద్యంత వాక్యాలు చాలా కళాత్మకంగా నిబంధితాలయినవి. ఆద్యంత వాక్యాలూ ఊర్వశివే.

'వొచ్చాను.... చివరకి వొచ్చాను.... ఎన్ని యుగాలకు కనపడ్డావు నాకు !'

'దయగా నాకు లేదనుకోకు.... నీతో కలసి సుఖించిన ఊర్వశినే తలచుకో నన్నందుకో గలిగేవరకు. నేను వెడతాను—'

ఇవి ఆద్యంత వాక్యాలు. దీనిలో గమనించవలసింది, నాటకం 'వొచ్చాను' అనే మాటతో ప్రారంభమయి, 'వెడ తాను' అనే మాటతో పూర్తికావడం. ఈ విధంగా నిబంధిం చాలని ఉద్దేశ్యపూర్వకంగా చలం చేసిందీ, లేందీ అజ్ఞాత విషయమే. కాని- ఆ సందర్భాల్లో తప్పనిసరిగా ఆ మాటలు రాయవలసిరావడం మాత్రం నిజం. దానికి రచనలోని తీవ్రతా, శక్తి మాత్రమే కారణాలవుతాయి.

ఆద్యంతమూ మనకు దీనిలో గోచరించేది ప్రేమయొక్క స్వరూప నిరూపణ. ఇది తత్వాధారంగా నిర్వహితమైంది. ఆత్మయొక్క పవిత్రతకు బాహిరములైన అహంభావాదులు పూర్తిగా నిర్వృతం కావలసిఉంటుంది. ఆ ప్రయత్నమే పురూరవ విషయంలో ఊర్వశి కృతం.

'ఆ బట్టలతో, హారాలతో నీ అహంకారాన్ని కూడా అక్కడే వదలిరా' అని ఊర్వశి పురూరవుణ్ణి అంటుంది మరొకచోట. (పు. 21)

'నీ మీద కాదు, నీ మీద గొప్ప ప్రేమ. నా కసి నీ అల్పత్వం మీద, అంధత్వం మీద' అంటుంది. (పు. 23)

ఈ 'అల్పత్వం' 'అంధత్వం' అనేవి మానవునిలో కెల్లా వచ్చాయి ? అని ప్రశ్నించుకుంటే, 'కృత్రిమమైన నాగర కతకూ, దురభిమానాలకూ, డాబులకూ, దర్పాలకూలోబడడం వల్లనే' అనేది సూటిఅయిన సమాధానమవుతుంది. పై గుణాల వల్ల మనిషికీ మనిషికీ సంకుచితమైన పరిధులు ఏర్పడ్డాయి. వీనివల్ల ఇతర వినాశపిశున సర్వకార్యాలూ ప్రక్రియలూ ప్రారంభమైనాయి. అందుకని వీటన్నిటికి మూలమైన అహంఒక్కటి నశించాలి. [23]అభిమానం దగ్ధ మయిపోవాలి.

అయితే ప్రేమ స్వచ్ఛంగా వికసించాలేగాని—స్వచ్ఛంగా అంటే, ఇతర విషయ కలుషితం కాకుండా— సూర్యకిరణా లకి మంచులాగా పైవన్నీ కరిగి ఇంకిపోతాయి. మళ్లీ పేరు కోవు.

'ప్రేమంటే ఏమనుకున్నావు ?.... ప్రేమంటే, ఆశించిన స్త్రీ నీ ఆలింగనంలోకి వస్తే ఏభారం లేకుండా అనుభవించడ మనుకున్నావా ? కంటికి బావున్న స్త్రీనల్లా నీ పాన్పు మీదికి రమ్మని ఆహ్వానించడమనుకొన్నావా ? స్త్రీ సౌందర్యం ఎందుకు సృష్టింపబడ్డదనుకున్నావు ? పురుషుణ్ణి కాల్చి మెడ వొంచి, కళ్ళు తెరవడానికి, అతని ఆత్మని అతనికి చూప డానికి, తక్కిన ఆలింగనాలన్నీ సృష్టిజరగడానికి' అని అంటుంది ఊర్వశి. (పు. 37)

ప్రేమను గూర్చి, స్త్రీ సౌందర్యాన్ని గూర్చి ఇది చలం ఉద్దేశ్యం.

---

21. శాపం ఫలానా అని నాటకంలో ప్రస్తావితం కాలేదు. కాళిదాసు ఊర్వశికి వచ్చిన శాపమే కావచ్చు.

22. ఎదగడం అంటే సంకుచితమైన మనస్సూ, ఆత్మా, అత్యంతమూ విశాలమవడం. చావడమంటే ఈ 'నేను' అనే భావం నశించడం. ఆ నేను అనేదే లేకపోతే నాకూ ఈ యిసుకరేణువులకూ భేదమేలేదు. (మ్యూజింగ్స్. భా. 2. పే. 167).

23. మరణవేదనతో ఆత్మ నలిగి, తపించి భస్మమైతేకాని దురభిమాన పిశాచం వొదలదు. (శశాంక. పే. 46.)

పురూరవుడిలోని ఒక్కొక్క అహాన్ని నివారించడానికి ఒక్కొక్క సంఘటన కల్పితమయింది నాటకంలో. వాద్య ప్రావీణ్యం, రతికళా పారీణత్వాలు నాట్యరతులతో నివారితములైనవి. స్వ సౌందర్య నిర్భరత్వం ఊర్వశీ సౌందర్యంచే విస్తారితమయింది. తనదే ఉత్తమమనుకునే సందర్భంలో స్వీయంకన్నా ఉత్తమమైనదాని దర్శనం వల్ల తత్పూర్వమైన 'అహం' సద్వ్యక్తియందు లోపించడం సహజం. సహజంగా సత్యాన్వేషకుడయిన పురూరవుడిలో ఈ దృగ్విధంగానే అవి లుప్తమయినవి.

ఒక కర్మయందు దీక్షవహించిన వ్యక్తికి తత్కర్మ వ్యతిరిక్తములయినవి పట్టవు. వాటిని పట్టించుకుంటే దీక్షయందు శైథిల్యం చేకూరిందన్నమాట. ఉదాహరణకి సన్న్యాసికి గృహస్థధర్మ బాధ్యతలుండవు. ఉంటే సన్న్యాసంలో లుప్తి కలిగిందేకదా. ఈవిధంగానే ప్రేమ దీక్షాపరుడికి– పురూరవుడికి- యుద్ధము హింసాది అవసరభాధ్యతలు— ఒకప్పుడు- అనవసరములే అవుతాయి. ప్రస్తుతం ...

ఇదే ఒకచోట ఊర్వశి అంటుంది.

[24] 'అధర్మాలు- నీకు యుద్ధాలూ, రాచరికాలూ ముఖ్యమైన దినాలలో కట్టుకున్న బంధాలు. ఈనాడు నువ్వు (ప్రేమ) దీక్షాపరుడివి. నీ ధర్మం వేరు.'

దీనికి పురూరవుడు 'దీక్షాపరుణ్ణా' అంటాడు.

అవును. సాంఘికంగా, లౌకికంగా ఏ దీక్షలైతే ప్రస్థితములై ఉన్నాయో, వానియందే లోకం 'దీక్ష' అనే పదాన్ని ఉపయోగించడానికి ఒప్పుకుంటుంది. కాని దాని అనుభూతికి అందని విషయాలలో దీక్షాపదం అది పైచదు. ఇది లోక సామాన్యవిషయం. అందుకనే పురూరవు డల్లా అన్నాడు. అందుకు ఊర్వశి ఇలా అంటుంది :

[25] "అంతేలే, నీ మనసునించి ఆ అభిప్రాయం పోలేదని తెలుసు నాకు. శృంగారం, ప్రేమా చాలా తీవ్రమై కాలాన్నే కప్పివేసినప్పుడు, అది ఉత్త స్త్రీలోలత్వం. మీ మనసుల్లో.... సుఖం కానీ, కష్టంకానీ, ఏ స్థితివల్ల మానవుడికి ఔన్నత్యానికి తోవ కలగదో, అది వృథా. అందులో స్త్రీ శృంగారం వల్ల మీఏ అధికంగా విజ్ఞానంతెచ్చుకోలేనివారు పుత్తదౌర్భాగ్యులు.

[26] ఈలోకపు వెల్గులోకీ, ఆ జన్మకే కాదు- ఆ లోకపు వెలుగులోకి, జన్మకి కూడా స్త్రీయే ద్వారం" అని.

మరోచోట ఇల్లా అంటుంది :

'రానీరోగం, రోగగ్రస్తుడివైతే ఏంగాక, నాకన్న నీరోగం నీకు ముఖ్యంకానన్నాళ్లు' అని. (పు. 48)

సావిత్రి తన ప్రేమాలంబనాన్ని మృత్యువునుండి తప్పించుకుంది ఈపద్ధతిద్వారానే. ఇది పురాణగాథ కావచ్చు. ప్రేమ స్థిరమయినప్పుడు మిగతా బంధాలన్నీ గౌణంగా అయిపోతాయి. తన ప్రేమకోసం సామ్రాజ్యాన్ని తృణీకరించినట్టి ఎడ్వర్డూ ఆధునికంగా ప్రత్యక్షభూతుడు. అజ్ఞాతంగా ఈ స్థితిలో ఉన్నవారు దేశంలో ఉన్నారు.

చలం పురూరవలో నాయికానాయకు లిద్దరికీ నగ్నత్వం ప్రతిపాదించినాడు. ఈ నగ్నత్వం అనేమాట వినబడగనే అదొక వింతనీ, వికారాన్నీ లోకంలో స్ఫురింపజేస్తుంది. ఈ నగ్నత్వం స్వచ్ఛత్వానికి ప్రతీకగా తీసుకోబడింది నాటకంలో. అచ్ఛాదన శారీరక పర్యవసాయి మాత్రమే కాదు. మనఃపర్యవసాయికూడా అయింది లోకంలో. తన్మూలంగా కపట, దంభాదులే ప్రత్యక్షాలవుతున్నాయి కాని స్వచ్ఛత్వం నిరస్తమయిపోయింది. వీనియొక్క పెరుగుదల, అచ్ఛేద్య దశలోకి పరివర్తితమయింది. అందుకని తద్విచ్ఛేదనను నిరూపించడానికే నగ్నత్వం దీనిలో కల్పితమయింది.

'నివేదన' అనే ఒక వచనఖండికలో చలం అంటాడూ,

—'నీ సమక్షానికి నగ్నంగా రమ్మని నీ ఆజ్ఞ, ఎంత కఠినుడివి! ........ఎంత ఆశపడ్డాను. గర్వంగా నీముందు నా ఆడంబరాల్ని చూపుకోవాలనీ, నీకోసం వచ్చిన నేను సామాన్యమైనదాన్ని కాదనీ, నా అందంతో, ఐశ్వర్య విభవంతో నీకళ్లు చెదరగొట్టి ఆకర్షించాలని, [27]నగ్నంగా నీ ముందు నిలబడితే నేనేం గుర్తు నీకు?' అని.

అంటే ఆడంబరాన్నీ, అసామాన్యత్వాన్నీ, అందాన్నీ, ఐశ్వర్యవిభవాన్నీ, వదలడమే నగ్నత్వం పొందడమన్న మాట. అందరూ గనక 'అతని' ముందు నగ్నత్వంతో నిలబడితే 'నే' ననే అభిజ్ఞ 'అతని' కెల్లా కలుగుతుంది? అని 'ఈవిడ' సందేహం. అనేకత్వమందు ఏకత్వం సిద్ధించినప్పుడు ప్రత్యేకాంశంయొక్క విశిష్టత ఏమీ ఉండదు.

24, 25. పురూరవ. పే. 70, 71.

26. పెకు్ప నా ముక్తిమార్గం ప్రతి స్త్రీ లావణ్యమూ నాకు భగవాన్‌ని జ్ఞాపకం చేస్తుంది. ఆమె శరీరాకర్షణకి అంధుణ్ణికాను. (చలం ఉత్తరాలు. ఉత్తరం-118).

27. 'అచటి బహుజన రక్తచిహ్నములయందు నాది యిదని గుర్తేమి కన్పడుమ స్వామి!' (విశ్వనాథ సత్యనారాయణ-నీరధము.)

తద్విశిష్టత కావాలన్నామా, అన్యాంశంనుండి ఈప్రత్యేకాంశం విభిన్నత్వాన్ని పొందుతుంది. అప్పుడు 'గుర్తింపు' సులభమే. కాని అప్పుడా ప్రత్యేకాంశానికి 'అహం' ఏర్పడిపోతుంది. తదహం విశిష్టతే అనర్థకమూల మవుతున్నది కాబట్టి. విశాపికా 'గుర్తింపు' అప్పుడూ ఉండదు. అందుకని ఈ ఉండకపోవడానికన్నా, ఆ ఉండిపోవడమే వాంఛనీయమవుతున్నది. నగ్నత్వం అంటే చలం ఉద్దేశ్యం ఇదేకాని, లౌకికంగా వ్యవహృతమయ్యేది కాదు.

ఊర్వశీస్వరూపనిర్ణయం ఉన్నతస్థాయిలో జరిగిం దీనాటకంలో. ఊర్వశి దేవతగా భావింపబడుతున్నది. దేవతలందరూ తేజోరూపాలనిగదా భావ్యమవుతున్నది. తేజస్సు అస్మదాది పదాకృతికి ఉండదు గదా. తదాకృతి లేనప్పుడు మనుష్య లోకంలోవలె శారీరికమయిన అనుభవం ఉండడానికి వీల్లేదు. కర్మేంద్రియాలు వాహికలుగా, లౌకికమయిన ఈ అనుభవం సాగుతుంటుంది. కర్మేంద్రియ వాహికా విరహితమయిన అనుభవం అనుభూతికి రావడం కష్టతమవిషయం. అందువల్ల తేజోరూపమైన ఊర్వశితోడి అనుభవం. [28] మృణాళినీత్యాది అవ్య వ్యక్తుల నుండి లభ్యమయినట్లు కాదు. అయితే ఊర్వశి పురూరవుడికి మానవరూపంలో లభ్యమయింది. అంటే అననుభవరూపమయిన ఊర్వశికి, అనుభవానురూప రూపం కల్పితమయిందన్నమాట. మానుషలభ్యమైన ఒక మహోన్నత శృంగార, ప్రేమానుభవానికి ఊర్వశి ప్రతీక అయిందన్నమాట. ఈ ప్రతీకయైన ఊర్వశి నాటకాన్నంతా ఆవరించిఉంది.

అయితే ఊర్వశి కీ విధమయిన రూపకల్పన జరిగినా, ఒకవిధమైన మహోన్నత మానసిక, ఆత్మికమయిన అనుభూతి. ఈ అనుభవం పురూరవుడికి ఏ మహానుకృతంవల్లో లభించింది. ఆ అనుభవాన్ని స్థిరీకరించుకోవడానికి, దీర్ఘీకరించుకోవడానికి పురూరవుడు తన మనస్సు నెరిగించుకోవడం ముఖ్యమయింది. తాత్కాలిక లబ్ధమయిన ఆ అనుభవం, దానివల్ల అతనికి సర్వదా అందుబాటులోకి రావాలి. అందుకనే ఆ ఆనందానుభవ సందర్భంలో పురూరవుడు: 'మనంకాదు, నువ్వూకాదు, నేనూకాదు, నువ్వూ అవును, నేనూ అవును. భేదంలేని నువ్వూ నేనూ ఐక్యమయిన మనం' అని అంటాడు. (పుట. 124)

అంటే ఆ అనుభవపరిణత స్థితిలో విభేదం ఉండదు. ఐక సత్య స్వరూపమే అక్కడ భాసిస్తుంది. భిన్నత్వం ఉండదు. అంతా ఏకత్వమే. భిన్నత్వమందు ఏకత్వం కలిగి అవితరమయిన అద్వైతానందం కలుగుతుందన్నమాట. ఈ అనుభవం సాయుజ్యానుభవంగా భావ్యమవుతున్నది. ఈ సాయుజ్యానుభవం వల్ల విశ్వమందలి ఏకత్వం, విశాలత్వం గోచరమవుతుంది కాని లౌకికభిన్నత్వంకాదు. ఈ భిన్నత్వ దశ ఏనాడు లోకంలో మృగ్యమవుతుందో ఆనాడే లోకం ఉన్నత గమనంలోకి వెళ్ళుతుంది.

'ఉన్నత గమనం అంటేనే పూర్వ బంధనాశం అన్నమాట.' (పుట 99) పూర్వబంధాలంటే లౌకికాలయిన రాగద్వేషాదిబంధకాలన్నమాట. అహంతాది నిరాసకమైన అనుభవార్హత కలిగినప్పుడే ఆ ఉన్నతమైన గమనం కలుగుతుందన్నమాట. పురూరవుడికి అది స్థిరంగా కలగలేదు కాబట్టి, ఆ అర్హత లేకపోయింది. ఆ గమనం లేకుండాపోయింది. అంటే కథాదృష్ట్యా ఊర్వశి అతన్ని వీడిపోయిందన్నమాట.

'ఊర్వశి అంటే ఒక అనుభవం. శరీరంకాదు' (పు. 135) అన్న ఊర్వశి మాటకు పురూరవుడికి సందేహం కలుగుతుంది '—ఊర్వశి పురూరవుడి ప్రేయసి అనడంలో అర్థమేముంది?' (పు. 135) అంటే పురూరవుడు తన పూర్వ ఫలితంగా ఊర్వశీ అనుభవానికి అర్హుడౌతున్నాడన్నమాట.' (పు. 135) అయితే స్వర్గానికి వెళ్ళే వాళ్ళందరికీ ఊర్వశీ అనుభవం పురూరవుడికివలెనే జరుగుతోంది గదా. ఇక పురూరవుడి ప్రత్యేకత ఏమిటి? ఈ విధమయిన ప్రశ్నే పురూరవుడికి కలగకుండా ఉండవలసింది. ఇది ఇంకా అతని [29] సంకుచితత్వాన్నే సూచిస్తుంది. కాని విశాలత్వాన్ని కాదు ఎందుకంటే అనుభవస్థితిలోనికి పోయినప్పుడు, ఆ ఐక్యస్థాయి నందినప్పుడు ఈ 'ప్రత్యేకత'యొక్క దృష్టేఉండదు.

పురూరవుడు ఈ లోకంలో ఉన్నాడు కాబట్టి, అతనికోసం శారీరికమయిన రూపం ఆ అనుభవానికి కల్పించబడవలసివచ్చింది. కాబట్టి యదర్థమై అది కల్పితమయిందో, తదర్థమయ్యే పర్యవసితమవుతుంది. స్వర్గతులైనవారికి ఈ అనుభవమే కాని ప్రత్యేక ప్రత్యేకంగా లౌకిక విధమయిన అనుభవం ఉండదు. తచ్ఛారీరికాభాస మాత్రమే ఉంటే ఉండవచ్చు. వాళ్ళు ఊహాప్రకారంగా అనుభవం పొందుతారుగదా! కాబట్టి తిరిగి స్వర్గంనుండి పురూరవుడికి కనుపించడానికి ఊర్వశి వచ్చినప్పుడు పురూరవ జ్ఞాత పూర్వరూపంతోటే వస్తుంది కాని లౌకిక శరీరంతో కాదు. ఆ తేజస్సు అల్లా ఒదిగిందన్నమాట.

కథా దృష్టితో మరో విషయం ఉంది. ఊర్వశికి శాపం మానుషత్వంవల్ల వచ్చింది. శాపాంతంతో అది విడి

28. మృణాళిని 'పురూరవ' లో పరామర్శిత అవుతుంది. ఆమె పురూరవునియొక్క పూర్వప్రియ అన్నమాట.
29. బృహస్పతిః- 'సంకుచితమైన ఈ తృష్ణలకు అతీతులము కావాలి.' (శశాంక. పే. 6).

పోయింది. అయితే ఇందులో ప్రేమ శక్తి ప్రసక్తి ఏమిటి? ఆమెకు శాపం రాకుంటే పురూరవ సమాగమమే లేదు. శాపాంతం తరువాత అంటే, శాపం సమాగమహేతువవుతున్నది. కొన్ని ఉక్త ప్రేమాది హేతువులు నిజమయినవి కావు. ఇది ఆలోచించదగింది.

అసలు ఊర్వశికి శాపం ఎందువల్ల వచ్చింది?
దేవసభలో చేసిన ఒక పొరపాటువల్ల.

ఆ పొరపాటు ఎందువల్ల కలిగింది?
పురూరవుడిపైని ఆమెయొక్క ప్రేమవల్ల.

ఆ పొరపాటు వల్ల ఆమెకి శాపం వచ్చింది గదా. అంటే శాపాత్పూర్వమే ఆమె ప్రేమ పురూరవ నిష్ఠమైందన్న మాట. దీనివల్ల ఆమె ప్రేమ తన వికాసానికిగాను శాపం పొందింది అని తెలుస్తుంది. ఆమెకు తెలుసు, దేవసభలోని అల్లాంటి తప్పిదాలకు శిక్ష లుంటాయని. పొరపాటు అంటేనే ఉద్దిష్టంగా చేసింది కాదని. అంటే అజ్ఞాతమైన ఆంతరిక ప్రేరణే బలవంతంగా దాన్ని జరిగించింది. కాబట్టి జ్ఞాతమైన నియమాచరణకన్న ఆంతరికమైన ప్రేమయొక్క ప్రేరణే బలవత్తరమయిందన్నమాట. అందుకనే శాపం దుఃఖహేతువుకాక ఆనంద స్పందకమయింది. అందుకనే శాపంయొక్క బలంవల్ల వొచ్చావు కాని ప్రేమవల్ల కాదనే పురూరవుడికి సమాధానంగా ఊర్వశి :

[30] 'నా ప్రేమ అనివార్యం. తప్పదు నిన్ను కలుసుకోవడం. కలుసుకోంది నా జీవితానికి అర్థంలేదు. గొప్ప శక్తి ఊపుతుంది నన్ను నీ దగ్గరకి. అది శాపంవల్లకానీ, వరంవల్లకానీ, ప్రేమతోకలయిక అనే నిశ్చల వాస్తవం, అనేక మార్గాల, ప్రయోజనాలవల్ల సఫలమవుతుంది.... [31] అల్లాంటి సంబంధం నీతో నాకు విధితో, సృష్టితో ఏర్పడ్డది. నువ్వు నన్ను పొమ్మన్నా, వదిలించుకోవాలని చూచినా, నా ప్రేమ నిన్ను వదలదు' అని అంటుంది. అందువల్ల ఉద్దిష్టమైనది మహోత్తమమయితే ఏ మార్గంలోనన్నా నెరవేరుతుం దనేది నిజం.

శాపాంతం కూడా ఈ విధంగానే గమనించాలి. తనకి పిలుపు వచ్చినప్పుడు తప్పకుండా వెళ్ళవలసి ఉంటుందని ఊర్వశి పదేపదే గుర్తుచేస్తుంటుంది. ప్రేమతో ఏ విధంగానో ఓ విధంగా కలయికజరిగింది. ఇక వియోగం ఎల్లాకలిగింది? ఆ పిలుపు వస్తే ఆగడం తన తరంకాదని చెప్పే ఊర్వశి మాటలవల్ల పిలుపు చాలా బలవత్తర మవుతోంది. ఆ దృష్టితో చూచినా ప్రేమ బలహీనమే అవుతున్నది. కాని ఒక విషయం ఇక్కడ గమనీయం ఉంది. ఊర్వశి 'ఆ' పిలుపు వస్తుందంటుందే కాని, నిర్దిష్టకాలాన్ని చెప్పదు. ఆమెకే అది అజ్ఞాతం. ఇక ఎప్పుడయితే పురూరవుడు ఆమెని- ప్రేమని- అంతఃప్రేరణవల్ల ధిక్కరిస్తాడో అప్పుడామె అతన్ని వీడింది. అంటే అతని ధిక్కరణ ఆమెకి పిలుపు-అతన్ని విడవడానికి హేతువయిందన్నమాట. అతని ఆ ధిక్కరణే లేకుండాఉండేట్టయితే ఆమె అతన్ని వదిలేది కాదన్నమాట. జీవితాంతమూ ఆ ధిక్కరణలేకుంటే జీవితాంతమూ వదిలేదికాదు, అంటే ఆ పిలుపు- ఆమె అతన్ని వదలడం, ఆ ధిక్కరణ మీద ఆధారపడిఉన్నాయి. అతనికి [32] పరిపక్వతరానప్పుడు అతడు ప్రేమని పూర్ణంగా ఇముడ్చుకునే స్థితికి రాలేదన్నమాట. అందుకని అతనికి 'ఇంతకాలం' ఇచ్చిన జ్ఞానంతో, అతడు స్వంతంగా ఇకముందు ఆ అర్హత సంపాదించుకోవలసిఉంటుంది. 'అంత ఔన్నత్యాన్ని నీ స్వభావానికి తెచ్చుకోగలగాలి' అని చివరలో పురూరవుడితో ఊర్వశి అంటుంది. ఆమె విడిపోయిం తరువాత, అతడు చేసిన కర్మలకి, దేవతల ద్వారా ఊర్వశి అతని దగ్గరికి వచ్చి అతన్ని ఔన్నత్యంపొందడంకోసమే వత్తిడిచేస్తుంది. ఆమెకు తెలుసు, అతనికి పూర్ణతరాలేదని. అల్లాకాకుంటే పురూరవుడితో ఆమె అన్నట్టు విధితో పోట్లాడి అతన్ని లభించుకునేదే. ప్రేమ అనేది దీక్ష కాబట్టి, దీక్షాభంగం వల్ల దాని ఫలితం అనుభవించవలసింది. అది శిక్ష అనిపించుకోదు. ఆగామి ఔన్నత్యమార్గమవుతుంది. అందువల్ల ఈ శాప, శాపాంతాలు ప్రేమ యొక్క విషయంలోనే పర్యవసితాలవుతాయి కాని, ఇది వాటిల్లో ఇముడ్చబడదు.

ఈ విధంగా చూస్తుంటే పురూరవలో ఇంక చాలా విషయాలున్నవి. ముఖ్యంగా దీనిలో ఆయన అద్వైతాన్ని ప్రతిపాదించినాడు.

ఈ వ్యాసాన్ని ఊర్వశి మాటలతో ఇల్లా ముగిస్తాము :

[33] 'జీవితమంటే ప్రతి అడుగుకీ కదలిక. కదలిక అంటే త్యాగం, తోవ పొడుగునా వదలడం. అందులో ప్రేమ జీవితమంటే చాలా వేగమైన కదలిక. క్షణక్షణానికి తీవ్రమైన పరిత్యాగం.'

---

30. పురూరవ. పే. 73. 31. పురూరవ. పే. 77.

32. బృహస్పతి :- ప్రేమ ఆత్మ సమర్పణమైనప్పుడే స్వీకరణార్హము. (శశాంక. పే. 9). బృహస్పతి :- ప్రేమ కోరిన త్యాగానికి జంకేవాడు ప్రేమ కనర్హుడు. (శశాంక. పే. 65). 33. పురూరవ. పే. 115.

# సహగమనం

వేదుల లక్ష్మీగణపతిశాస్త్రి

పాపం! భూపతి మరణించాడు.

లోకం తాలూకు సానుభూతికోసం, అతని ప్రాణజ్యోతి తహతహలాడి, ఆరిపోయింది. జ్ఞాతులైనవారంతా, ప్రాణంతో వున్నన్నాళ్ళూ, పగ పట్టినట్టుగా తప్పించుకునే తిరిగారు. కాని — యీనాడు...వాళ్ళెందరో కావలసినవాళ్ళై కని పెట్టుకున్నట్టు బ్రతికారు. అందిన ఆశ్రయాన్ని, అసమర్థులుగా చేజార్చుకోకూడదనే భద్రంలో పడ్డారు.

లోకం దృష్టిలో సుఖభోగులకి ఉదాహరణంగా చెప్పబడే భూపతి...సుదూరతీరాలలో కలసినట్లు భ్రమింపజేసే సమానాంతర రేఖల్లాంటి పట్టాలపై, నిశ్చింతగా, నిరవధిగా సాగే ధూమశకటంలా, జీవయాత్రని అతి సుఖతరంగా సాగిస్తున్నాడను కుంటోంది లోకం. ఆర్థికపుష్టే తన పుష్టిగా ఉపా సించుకుంటూ, అన్యచింతలను చొరనీయకుండా మరీ ఆర్జించాడని చాటింది. ఏ ఆశాపాశాలూ లేని ఏకోనారాయణు డన్నారు కొందరు...

ఏమంటే నేం!...ఎందరనుకుంటే నేం!!...

భూపతి ఆంతర్యం ఎందరికో అర్థంకానిదే అయి పోయింది.

కోరికల్నీ, తృప్తుల్నీ, ఆప్తుల్నీ, స్వార్థాన్నీ... అన్నింటినీ, దిగమ్రింగుకుని, భూపతి ప్రాణజ్యోతి ఆరిపోయింది.

శవం చుట్టూ పరుచుకున్న మృత్యువు నీడలు తప్ప మరేం లేవు. ఇంటిచుట్టూ విషాద వాతా వరణం హోరున పోరెట్టుతోంది. చుట్టుప్రక్కల వాళ్ళు, ఎరుగున్నవాళ్ళూ, ...భూపతి నానుకుని నించున్నవాళ్ళూ...అంతా కంట తడిపెట్టుకుని, గతాన్ని అనుగతంగా, స్మరించుకుంటూ...రోది స్తున్నారు.

'జిమ్మీ' మాత్రం అర్థ నిమీలిత, నేత్రాలతో ఏడుపు చేతగాక, శవం ప్రక్కనే పడుక్కుని, డొక్క ఎగరేస్తోంది. మూగగా తన హృదయంలో చెలరేగి, అస్తవ్యస్త మౌతూన్న, నిశ్వాసాలతో...

గృహగర్భంలో గూడుపుఠానిగా చేరారు కొందరు సిసలైన శ్రేయోభిలాషులు; చిరకాల వాంఛితాన్ని యిక నిశ్చింతగా, వినియోగపరచు కోడానికి అనువైన మార్గాన్వేషణల మంతనాలలో, తల మున్కలుగా, తికమకలు పడుతున్నారు. జిమ్మీ లేచింది—

విషాదం వెల్లువలై, సంతత ధారగా అశ్రు కణాల్ని రాల్చుతూ, రూపుదాల్చిన శోకంలా, మూగవేదనతో, అర్థ నిమీలితంగా, యజమాని మంచం చుట్టూ ప్రదక్షిణాలు చేస్తోంది జిమ్మీ.

ఏ పురాజన్మ సుకృతలబ్ధమైన అవలంబనా భావమో తళుక్కుమంది. హృదయంలోని ఆరా టంతో, అయోమయంతో పాపం! జిమ్మీ, అతలా కుతలమైపోతోంది. అంగలార్చుకుంటూ అతని చుట్టూ వుండుండొకసారి తిరిగి వస్తోంది.

మానవుల కున్నట్టే, జంతువుల్లో కూడా, కొన్ని కొన్ని విపులీకరించి చెప్పలేని సంబంధానుబంధాలు, భావోద్రేకాలు, మమకారాలు...వుండితీరాయని చెప్పటానికి యింతకన్నా ప్రబలమైన నిదర్శనం మరి ఏంకావాలి!!...

ఒక జీవి మరొక జీవితో... ఒక హృదయం మరొక హృదయంకోసం...అంతా సృష్టి లీల!...

శవం చుట్టుకొని హోరుపెడుతున్న వాతావరణం ....సన్నగా మబ్బుతెరల చాటున, చిన్నగా, కునుకు పడుతూన్నట్టు, చినుకులు !!... ప్రకృతి హర్షంలా సన్నని వర్షం!...

భూపతి పాదాల్ని తాకుతూ జిమ్మీ దీర్ఘ నిశ్వాసాలు, మాటిమాటికీ వినిపిస్తున్నాయి.

"యీ కుక్క యిక్కడెందుకూ ?...అవతలికి పంపెయ్యండి..." భూపతి మేనమామ గొంతులోని ఘోష వినిపించింది. జిమ్మీ అరమోడ్పు కళ్ళతోనే ఆలకించింది. శవానికి మరింత దగ్గరగా శరీరాన్ని ముడుచుకుంది. సన్నగా మొరిగింది....

భూపతి జీవితాన్ని పరామర్శిస్తే....ప్రశంసించాలో, తెగనాడాలో, చట్టున బోధపడదు.

భూపతి బ్రతికి వున్నంతకాలం, ఎవరికి వుపకారం!!— ఓ దానాలు చేశాడా? ...ధర్మాలు చేశాడా?? ఓ ఆస్పత్రి కట్టేందుకేమైనా చందా యిచ్చాడనా? ఏ పాఠశాలకైనా పేరు పెట్టుకునేలాగైనా చేసుకున్నాడనా???... ఏంచేశాడని, అతన్నిగూర్చి అందరూ, ఎంతో అంత ఘనంగా గుర్తుంచుకోవడానికి!!

తనని తాను ఎరుకపరుచుకోవడానికి తానేం మంత్రి కాదుగదా! కనీసం, తానెప్పుడూ ఓ సినిమా సంస్థకైనా ప్రారంభోత్సవం చేశాడా!!

వున్నంతకాలం—కూడికలూ, హెచ్చవేతలూ, భాగహారాలతో, అణాపైసలు దగ్గరనుండి రూపాయలకు పెంచుకుని, ముద్దచేసి, మూటగట్టాడు.

ఎవరికోసమై యింతగా ఆర్జించాడో!

అనుభవించీ, అనుభవించకుండా, హఠాత్తుగా విడిచిపోయాడు. వున్నన్నాళ్ళూ పిసనాటపడి, .. తనకే అర్థంకాని మహా స్వార్థంతో ప్రవర్తించాడు!

అలాంటివాడు మరణిస్తే, సంఘానికేంలోటు? బంధువర్గానికేం దెబ్బ?

కట్టుకున్న వాళ్ళకీ, కడుపున పుట్టిన కొడుకులికీ, కూతుళ్ళకీ మాత్రం, ఏం దెబ్బ అయిందిగనుక!! అసలెవరికేమైంది?!!....

"వాళ్ళకి కబురు వెళ్ళిందా?..." ఎవరో అడిగారు.

"వెళ్ళింది! ఏం వస్తారో?!"

"ఏనాటి మొదటిభార్య కొడుకు!—వచ్చిందాకా నమ్మకంలేదు—"

"భూపతి చచ్చినా తిరిగి గుమ్మంలోకి రావమని శపథంఅట"!!

"రెండోభార్య, కొడుకులు మాత్రం వస్తున్నామని వార్త వచ్చింది."

"వాళ్ళకే కాబోలు యీ ఆస్తి అంతా దఖలు పడేది?"

వయసుతోపాటు మనసులోని మమకారాలు కూడా, వికారాన్ని పొందుతాయి కాబోలు!!

పూర్వజన్మ సుకృతమో, దుష్కృతమో ఏకొద్దిమందికోతప్ప, అందరికీ యిలాంటి చావు లభిస్తుందనుకోను; అమూల్యమైన సానుభూతిని ప్రతిష్ఠించి, మానవత్వాన్ని ప్రసాదించే హృదయం...అందరికీ అనువైనది కాదేమో!....

జిమ్మీస్మృతిఫలకంపై, సుఖమయ జీవితంలో నిలిచిన వివిధ ఘట్టాలెన్నో, పదేపదే పరామర్శలతో వేధించసాగాయి. అనుభవాలన్నీ సాలిగూళ్ళలా చుట్టూ అల్లుకుంటున్నాయి.

* * *

పాపం! జిమ్మీ:

లాయరు విశ్వేశ్వరయ్యగారింటిలో, ముద్దుముద్దుగా పెరిగిన రోజులు ....యింటిలోని వారేకాకుండా, వచ్చేపోయే పార్టీల, ప్రతి ఒక్కరికీ కూడా, ముచ్చట గొల్పుతూ, మురిపించుకున్న రోజులు...అందరిలోకి ముఖ్యంగా, హృదయానికి హృదయంగా పెంచుకున్న ప్లీడరుగారి పెద్దబ్బాయి కృష్ణ! అరక్షణంకూడా విడిచిపెట్టకుండా 'జిమ్మీ' అని పిలుచుకుని, పెంచిన రోజులు...

అలాంటి అమృతహృదయుడైన కృష్ణకికూడా, విధివిప్పుకు లోనై, అకాలమరణం సంభవించింది,

జిమ్మీ కళకాంతులన్నీ ఆతనితోనే అస్తమించాయి. జలజలా జిమ్మీ కళ్ళనుండి అశ్రువులు రాలాయి.

ఒకనాడు - సరిగ్గా యిలాగే, శీతలం చాలా జోరుగా వుంది. సీమనుంచి తెప్పించిన గౌను తొడుక్కుంది జిమ్మీ. విశ్వేశ్వరయ్యగారి ఆఫీసు గదులో, 'లా' పుస్తకాలున్న బీరువా ప్రక్కనే పడుకుని వుంది. బాల్యమిత్రుడైన, యీ భూపతి స్వంత వ్యవహారాలలో సలహాలు పొందటానికి, ముఖ్యంగా ఆయన్ని పరామర్శించటానికే, అన్నట్లుగా వచ్చారు.

కృష్ణను పోగొట్టుకున్న దురదృష్టపు జిమ్మీ, కంటబడిన ప్రతిక్షణం, పుత్రవియోగాన్ని గుర్తుకు తెస్తూ, వారి గుండెల్లో కుంపటిగా మారింది. మమకారాన్ని త్రెంచుకుని మొండిగా బ్రతకాలనే కృతనిశ్చయంతోనే విశ్వేశ్వరయ్యగారు, జిమ్మీని, అనంతమైన కడలి తరగలమధ్య, మిత్రుడు- యీ భూపతికి ధారాదత్తం చేశారు.

వాటినుండి నేటివరకూ భూపతి వుప్పుపులుసుల తోనే పెరిగింది జిమ్మీ !...

భూపతి ఆగ్రహానుగ్రహాలలోనే, అలవాటుపడి పోయింది.

ఇంతకీ అవిభాజ్యమైన అతని ప్రేమాభిమానాల్ని చూరగొనగల్గింది 'జిమ్మీ' ఒక్కతే అని చెప్పక తప్పదు. అతనికి అది, దానికి అతడు, అంతకుతప్ప అన్యుల ప్రమేయం లేదెప్పుడూను

అలాంటి జీవనపోషకుడు, ప్రేమాస్పదుడు అయిన భూపతికూడా నేడు శాశ్వతంగా, తనని విడిచి వెళ్ళిపోయాడు. కనుకనే జిమ్మీ నేడు సంతత ధారగా అశ్రుజలాలతో భూపతి పాదాల్ని కడుగుతోంది.

పోషణభారాన్ని వహించిన జీవునిపై కృతజ్ఞత తెల్పడం విధ్యుక్తధర్మం కాదా !
జిమ్మీ అంతరంగం ఘోషిస్తోంది.

★ ★ ★

" అన్నట్టు చలమరాజేడీ ??!...యింటిముం దెప్పుడూ, కుక్కలా పడుండేవాడే !!"

"'చిత్తం-చిత్తం' అంటూనే పెత్తనాన్నంతటినీ తన హస్తగతం చేసుకున్నాడు కదా!...." హాల్లోకి వస్తూ అన్నా రెవరో.

"దొంగముండాకొడుకు ! కల్లిబొల్లిమాటలతో, ఎంత డబ్బు గుంజుకున్నాడో ఏమో ! మా భూపతిని వట్టి అమాయకుణ్ణిచేసి..." ముక్కు ఎగ బీలుస్తూ మేనమామ మెహర్బానీ వెలిగిస్తూ సకిలించాడు.

"తల్లిరొమ్ము గుద్దే తుచ్ఛుడు! కాకపోతే— కంటికి కనిపించకుండా పోతాడా ?!"

"చెరువుక్రింద గరువు అయిదెకరాలు, ఎలా సంపాదించాడంటారు ??..."

"చిత్రం !....నరుడన్నవాణ్ణెవణ్ణీ నమ్మని భూపతి, వాణ్ణి నమ్మాడు. అర్థం, ప్రాణం, అన్నీ వాడికే అర్పించినట్టుగా అయింది ఆఖరికి...." మేనమామ వింతగా ప్రకటించాడు.

ఆశ్చర్యకరమైన సంఘటనే— అనుకున్నారంతాను.

"అలాంటివాడెలా వస్తాడులెండి! మొహం చెల్లొద్దూ ?!... " అన్నాడిందాకటి వ్యక్తే.

"దంపినమ్మకి, బొక్కిందే దక్కుడంట... !" గుమ్మందగ్గర నిలబడివున్న ఓ పెద్దమ్మ సాగదీసుకుంది.

"బ్రతికినంత కాలం ఏం అనుభవించాడని ?... ఓహో ! అంటే ఓహో ! అనుకోవడానికి లేదు గదా !!..." లోచనాల్ని చెరగుతో ఒత్తుకుంటూ, జాలిపడిం దో లోలాక్షి.

"ఘనంగా సార్థకమైన, ఒక్క మంచికార్యం కూడా చేసినపాపాన పోలేదుగదా యీ భూపతి!" సమూహంలోంచే ఎవరో చీదరించుకుంటూ వెళ్ళిపోయారు.

"ఎన్ని పెళ్ళిళ్ళు చేసుకుంటేనేం !.... ....ఎందరు పిల్లల్ని కంటేనేం ...!!"

"యితనితో ఎవళ్లు వేగగలరయ్యా !—ఏమాత్రమైనా ప్రేమతో పాకుళ్ళాదే పెద్దభార్య కొడు

కుత్తో, తగనివిరోధం పెంచుకుని, తరిమివేశాడు కదా!...యిక చిన్నఆవిడతో విరోధం...కూతురితో విరోధం......"

"అంతా శత్రుమయం. తననీడని చూసుకుని తనే భయపడే అనుమానఘటం...భూపతి జీవితంలో శాంతిలేదు."

"రెండో పెళ్లాన్నయినా, యిలాగే నానా హింసలూపెట్టి, వేపుకుతినేవాడుట!"

"ఆవిడమాత్రం ఎన్నాళ్లు కాపరం చేసిందేమిటి ??..."

"ఆ స్తంతా ఆఖరిని, ప్రోగుచేసుకుని పట్టుకెళ్ళడానికి, రావడంతోనే సరిటమ్మా ?...."

"ఏమిటో! ఆపదలు పీటలెత్తవు—కరువులు కాపరాలూ చేయవు! అవన్నీ యిప్పుడనవసరం—మాటొకటే నిలిచేది!! ..."

"పాపం!...యింత బలగమున్నా, సమయానికి వాఅన్నవాళ్ళు ఒక్కరూ దగ్గర లేకపోయారు కదా!!....ఎంతడబ్బు నిల్వచేస్తే మాత్రమేం?... ఎందరు బిడ్డలుంటేమాత్రం ఏమయింది?"......

ఏడుపుల్లోనే రంగు రంగుల గొంతులు, జీరపోయిన గొంతులు, బావురుమన్న గొంతులు, నరంలేని గొంతులు...నలుమూలలనుండీ, మధ్యమధ్య, వాడిబాణాలుగా, సాగుతూనే వున్నాయి.

తీవ్ర నిర్వేదనతో, హృదయవిలాపాన్ని ఆపుకోలేక పోతోంది జిమ్మీ. శవాన్ని వదిలిపెట్టకుండా కడుపులోనే అగాధమైన గతాన్ని, నెమరేసుకొంటోంది. దిగులుతో దిక్కులు పరికిస్తోంది. తన భవిష్యత్తునుకూడా అన్నింటితోపాటు, పిడికిళ్ళలో బంధించుకుని, పరాభూతను చేయాలని తలుస్తూన్నది. పాపిష్టిమూక! తన శేషజీవితాన్ని వాళ్లకు తొత్తుగా మిగల్చడమా!—నిరావరణల మధ్య, నిస్సహాయంగా, నికృష్టజీవితాన్ని గడుపుతూ నిత్యం అశ్రుతర్పణలతో, తృప్తి పొందటానికా ??...తన భూపతిపై విశ్వాసాన్ని ఏవిధంగా వ్యక్తం చేసుకోవాలి ??—స్వామి ద్రోహిగా క్షణిక జీవన సౌఖ్యాల కాశించటమా? శాశ్వతమైనభక్తునిలా, నిలచిన దుఃఖాల మరుగులో ఒరిగే దీక్షవహించుట కర్తవ్యమా ??...తరుణోపాయం తెముల్చుకోలేక తహతహ లాడిపోతోంది జిమ్మీ. విధ్యుక్తధర్మం వేగిరపెడుతోంది.

మూర్ఖపుమూకకు తగిన గుణపాఠాన్ని అందజేయడమే అత్యంతావశ్యకమైన కర్తవ్యంగా ఎంచుకున్నట్లుగా, జిమ్మీ ఒక్కసారి లేచింది. ఇక ఆలస్యంలో ఆంతర్యం ఎంతమాత్రం లేదనే నిశ్చయానికి వచ్చింది.

రెండవ భార్య, కొడుకు, కూతుళ్ళూ అంతా వచ్చేశారు శవంమీద పడి, ఏడ్చి మొత్తుకుంటున్నారు.

వాళ్ళని ఓదార్చేవాళ్లు లేక ఒకళ్ళ నొకళ్ళు మరింత గట్టిగా కౌగలించుకుంటూ, మరీ ఏడుపులు సాగిస్తున్నారు.

పట్టెడన్నం మాత్రం చేతులారా భూపతిచేతితో దొరికేది జిమ్మీకి. అందుకు ప్రతిఫలంగా...తాను మాత్రం యినప్పెట్టె, కాపలా కాస్తుండేది. యజమాని డబ్బుదస్కం కూడా ఎవ్వరూ ముట్టశక్యం కాలేదు!!...

యీ సవితి కొడుకే ఓరోజున, యినప్పెట్టె తాళాలు తిప్పుతూండగా, మొఖం కనిపెట్టి, చిన్నగా భూపతిదగ్గరికి వెళ్ళింది జిమ్మీ. పెద్దగా అల్లరికాని ధ్వనిలో భూపతి చెవిలో మొరిగింది. తిన్నగా తీసుకెళ్ళి చూపించింది.

ఇంటివాడుకాక, అదే మరోవాడెవడైనా అయివుంటే, ఏనాడో ఆ దొంగ కండలు, తుండెతుండెలుగా పీకి పారేసేది!

ఇలాంటి సంఘటన లెన్నెన్నో...

అన్నింటిలోనూ జిమ్మీ తన విధ్యుక్తధర్మాన్నే పాటించితీరింది. అందుకే అంతకంతకు భూపతికి మానవు లెవరిమీదనూ లేని నమ్మకం, మమకారం, యీ జిమ్మీపైనే పొరలాడసాగింది. జిమ్మీయే అతనికి జీవిత భాగస్వామిగా తయారయింది.

"ఈ వెధవకుక్క అడ్డంగా యిక్కడెందుకు ?— అవతలికి తరిమెయ్యండి! యిలా పడి నానారోత చేయకపోతే—ఎందుకీ బొచ్చుకుక్క! గదంతా పాడుచేసింది !!...ఛీ! ఛీఛీ !!..."

కుక్క నవతలికి తరిమివేశారు. విధిని దూరు కుంటూ కాలు కుంటుకుంటూ, విడువలేక, బయటికి నడిచింది. యిల్లంతా కలయజూచింది.

జిమ్మికేం తోచిందో...బయటినుంచే వెనక్కు తిరిగింది. తిన్నగా యినప్పెట్టె గదిలోకి దూరింది.

యిద్దరు దొంగలు....తమ లక్ష్యసిద్ధిలో, తత్తర పాటుతో తాళాలూడదీస్తున్నారు. విశ్వ ప్రయత్నాలు చేస్తున్నారు.

ఒక చెంప కన్నీళ్ళు ధారతో యిల్లు తడిసిపోతూంటే! — స్వార్థపరమైన, అసుర ప్రవృత్తి, మానవత్వంలోంచి వేరుపడి డబ్బుకోసం, అఘాయిత్యానికి తలపడుతోంది! ధనకాంక్ష !!

లోకంలో జన్మించి, లోకాన్నే భస్మీపటలం చేసివేయ ప్రయత్నించే ముష్కర మానవులు :

అష్టకష్టాలుపడి ఆర్జించుకున్న వ్యక్తి, అనుభవించుకోకుండానే, అంతా దిగవిడిచే పోయాడు.

అతని కట్టెవున్న కాస్సేపైనా, వూరుకోలేకపోతున్నది యీ కాకిమూక!... అయ్యో!— అన్నట్టుగా, ఆ యిద్దరివైపూ, ఛీత్కారంగా చూసింది జిమ్మి పొమ్మన్నట్టు మొరిగింది. దొంగ ముఖాలుతో, వాళ్ళు చేస్తూన్న దోపిడీని పసిగట్టింది. కసిగా లంఘించింది. ఎవర్నీ కరవలేదు. అంతవరకూ నయమే!...అనుకోని యీ హఠాత్సం ఘటనకి—ఆటంకానికి, జిమ్మిని శాపనార్థాలు పెడుతూ, వారు ఎంతో ఖేదపడ్డారు. ఆత్మరక్షణకే అయితేనేం, అంతమందిలోనూ తలవంపులుగా, రసాభాస పాలవడానికి మనస్కరించకనే అయితేనేం; మెల్లిగా తలోక ప్రక్కగానూ తప్పుకుని తొలగిపోయారు.

అతని దగ్గరవాళ్ళంతా శవాన్ని చూచేదిక్కులో నున్నారు. చూస్తోన్నకొద్దీ, జిమ్మికి బాధ ఎక్కువై పోతోంది. యిదంతా భూపతి చేతిలోంచి, తన నోట్లోపడ్డ మెతుకుల ప్రభావం. అంతకంటెమిన్నగా వుండేటందుకు, చిత్రంగా చూచేటందుకు మాత్ర మేముంటుంది ! !

ఆఖరిదశలో ప్రతి ప్రాణి కోరుకునేవి, తమతమ ప్రియబాంధవులనుండి, ఆదరణతో కూడిన, ప్రేమానురాగపూరిత అశ్రుజలాలు...అవి కూడా నోచుకోలేకపోయింది పాపం! యీ భూపతి ప్రాణం. "చస్తే చచ్చాడులే! పీడే విరగడైంది. మాకేం - చట్టున చక్కబెట్టుకోవాలన్నా వీలు లేనట్లుగా చేసి, మరీ చచ్చాడుగదా!" అనే వ్యథతో బాధగా అనుకుంటున్నట్టుగానే వున్నారంతాను కూడా—

శవాన్ని, శ్మశానానికి తీస్కువెళ్ళటానికి జరిగే ప్రయత్నాలన్నీ ముగిసినవి.

అక్కడక్కడగా చేరివున్న, వాళ్ళంతా ఒక్కసారిగా గొల్లుమంటూ బయటబడ్డారు. అంతా బయల్దేరారు.

యిహంలో, యిసుమంత కూడా శాంతిని పొందలేకపోయిన భూపతి దేహం, చిరశాంతిని కోరుకుని, చితాభస్మం కావటానికై తీసుకొనిపోబడుతోంది.

'చచ్చినవాడి కళ్ళు చారెడేసి'—కనుకనే, వున్నన్నాళ్ళూ, ఏ ఒక్కరూ పల్లెత్తు ఉపకారం అన్నది చేయలేకపోయినా, చచ్చిన తరువాత ఎంతో హృదయవిదారకంగా, అందరూ, సానుభూతులను, సాగిపోతూన్న 'సవారీ' పై వెదజల్లుతున్నారు.

లోకంపోకడల్ని జిమ్మి పరామర్శించుకొంది.

యినప్పెట్టెకీ తనకీ పెద్దముడి.

యినప్పెట్టెలో సగందూరివున్న తాళాల గుత్తిని నోటకఱచుకొంది. గదిబయటికొచ్చి చూసింది జిమ్మి. దగ్గరలో ఎవరూ లేరు. కడదాకా భూపతి భారాన్ని వహించిన పందిరిమంచం వెలవెలబోతూ, వెక్కివెక్కి ఏడుస్తున్నట్టుగా వుంది. దానిచుట్టూ, కడసారిగా ప్రదక్షిణంచేసింది జిమ్మి. తాను మసలిన

యింటిని తల్చుకుంటూ, బంధనాల్ని తెంచుకుంటూ బావురుమంది జిమ్మీ. కర్తవ్యం తొందర చేసింది. కదిలింది. అయినా కాళ్లు, కావలసినంతగా సాగటం లేదు.

అల్లంతదూరాన శవాగమనాన్ని చూచిన చలమరాజు గభాలున తలుపు వేసుకుని లోపలికి పోయాడు. చచ్చినా సాధిస్తాను అన్నట్టు. కృతఘ్నుడు! మొహం చెల్లొద్దూ!!

రెండు మూడుసార్లు నోట్లోని తాళాలు క్రింద పడిపోబోయాయి జిమ్మీకి.

'పెట్టెలో ఏముందీ తనకి తెలుసు! దానికోసం ఎంతమంది కాచుక్కూచున్నదీ కూడా పూర్తిగా తెలుసు!! ...అన్నీ తెలుసు. అయితే— తన యజమాని స్వార్థాభిమానమూ, పిసలాటమూ మాత్రం తనకు తెలియని విషయాలా మరి! ఒక్కోఅప్పుడు జిమ్మీకి తిండి వెయ్యకుండా బాదిన దెబ్బలూ తెలుసు... విసుగుతో, విషయాన్ని అర్థంచేసుకోకుండానే తన్ని వేపుకుతిన్న విషపు సంఘటనలూ తెలుసు...

ఏమైనా అతడు తన యజమాని! అన్నప్రదాత!! ఏనాడు తా నీ యింట్లో అడుగుపెట్టిందో జిమ్మీ, ఆనాటినుంచే, అలాంటి పరిస్థితుల నెన్నింటినో ఆకళించుకుని, దిగమ్రింగుకుంది అక్షరక్రమంగా. ఆ యింటియొక్క ప్రతి విషయం వ్యక్తుల విభిన్న స్వభావాలతో సహా పూర్తి అవగాహనే అయిపోయాయి.

ఎన్నెన్ని ఆశ్చర్యకరమైన మార్పులు జరిగాయి! ఆ యింటిలో...గోధుమరంగు బొచ్చు నొకసారి ఝళిపించుకుంది.

పీతిన శవం వెళ్ళినదారినే గబగబా నడుస్తోంది. కళ్ళలో ఏదో ఆవేదన. ఆవేశంతో తూగిపోతూంటే, బొటబొట కన్నీళ్ళు రాలుతున్నాయి. పరిస్థితుల్ని పరామర్శించుకుంది. ఒక్కసారిగా వేగాన్ని హెచ్చించే పరుగుతీసింది.

నోట్లో తాళాల గలగలల మధ్య, నాగిపోతోంది జిమ్మీ. దాని జీవన చరమాంకపు లక్ష్యాల అర్థం ఎరుగని లోకం విస్తుపోయి, క్షణం, తమ కర్తవ్యాల్ని విస్మరించింది.

ఆశ కంతేమిటి!...అన్యాయార్జితంగా చేర్చుకున్నది చాలదన్నట్టుగా చలమరాజు జిమ్మీని అంత దూరంలోనే గుర్తుపట్టాడు. గుంభితంగా, అడ్డదారిన అంగలేసుకుంటూ వచ్చి జిమ్మీ వెంటపడ్డాడు. వున్నన్నాళ్ళూ తాను యింట్లో జిమ్మీని కేక వేసే అతి సాధారణ ధోరణి పుట్టిపడేలా భ్రమకల్గిస్తూ, పదే పదే జిమ్మీని చేరబిలుస్తున్నాడు చలమరాజు ఆ పయోముఖ విషకుంభాన్ని ఏనాడో పసిగట్టిన జిమ్మీ, గత్యంతరశూన్యంగా పరుగుని యింకా హెచ్చించింది చేజారిపోతోందనే వ్యధ విపరీతం కావడంతోనే, చలమరాజు అడ్డుకగిలి అదిలించబోయాడు కస్సుమన్న జిమ్మీ, కనురెప్పపాటులో బాణంలా దూసుకుపోయింది.

పాలించే మహారాజు మొదలు, పాచిపని చేసే పాకీదాని వరకూ, తరతమ భేదాల్ని తొలగించుకున్న మరుక్షణంలో చేరుకోవలసిన స్థానం, సర్వమానవ సమతాస్థాపనగా నిలచిన రుద్రభూమి...

మంటలు మహోజ్వలంగా రేగుతున్నాయి భూపతి చితిమీద. సాగివచ్చిన బంధుకోటి, శ్మశాన వైరాగ్యాల మధ్యే, వింత వింత సంభాషణలు సాగుతున్నాయి చిత్రంగా

"మంటలు కర్పిస్తే...ఎలాంటి కాలుష్యాన్నయినా కాల్చిపారేస్తాడు..."

ఆకాశాన్ని నాకేటంతటి నాలుకతో అగ్నిహోత్రుడు విజృంభించాడు — భూపతికట్టె బుగ్గికాబోతోంది. వేడికి తట్టుకోలేక దూరంగా నున్న రావిచెట్టుగట్టుపై కూర్చున్నారంతా!

అవసరాలకు అక్కరకు రాకపోయినా, అంతా ముగిసిందని తెలుసుకుని ముగ్గబెట్టిన ఆస్తిపాస్తుల్ని పుణుక్కుని పట్టుకెళ్ళడానికి మాత్రం సిద్ధంగా భార్యాబిడ్డలమంటూ ... బాంధవులమంటూ ... తయారయ్యారు, మానవత్వాన్ని మంటగలిపిన దాయాదులు.

భూపతి పెట్టిన చిప్పెడు మెతుకులు కతికి బ్రతికిన జిమ్మీ ఆతని అంత్యదశలో అన్నీ తానే అయి తన ఋణాన్ని తీర్చుకొంటోంది.

జిమ్మీ నోట్లోని తాళాలగుత్తి, మంటల వెలుగులో తళతళ మెరిశాయి. కళ్ళల్లో విషాదం వర్షిస్తున్న మేఘం పిడుగులు కురుస్తున్నది.

సంధ్యలో జారిపడ్డ సితమేఘశకలంలా, మరిగే రక్తంలా పొంగుతోన్న చితిలో జిమ్మీ ఒక్క పరుగున మంటలోకి దూకింది.

స్వార్థపూరిత మానవ హృదయంలోంచి దూకింది.

"ఎందుకలా దూకింది!!!!!..."

అర్థంకాని అయోమయంలో, అంతా ఒకరి మొహాలొకరు చూచుకోసాగారు.

★ ★ ★

అందం అందిపుచ్చుకున్నట్టుగా, పట్టుకుచ్చులాంటి గోధుమవర్ణంలో, అనుక్షణం తన యజమాని మనస్సు నెరిగి, మసలుకుంటూ వచ్చిన మానవాతీత మనస్తత్వం!...నేడు ప్రత్యక్షమయింది. అందరి మనసుకు హత్తుకునేటంతటిదిగా చిత్రించాలంటే, సారస్వతంలో సమర్థతకన్నా, సౌహార్ద్రమే ఆవశ్యకమేమో!

భూపతి మరణం ప్రపంచంతోబాటుదే! కాని—ప్రాణికోటికల్లా సృష్టిలో విజ్ఞానిగా నిలచిన, ఆ మానవుడే అందుకోలేకపోయిన, అంతర్యాల ఔన్నత్యాన్ని చూరగొని, ఆత్మార్పణం గావించుకున్న జిమ్మీ యశస్వి!

రూపం వహించిన విశ్వాసంలా, జిమ్మీ శాశ్వతంగా మన హృదయాల్లో సుస్థిరంగా వుంటుంది!...

చల్లా సీతారామాంజనేయులు | భార్గవీగీత

లంబితనింబశాఖిక లలంకృతముల్ - మృదులప్రవాళ నా
ళంబులతో, విలోల ధవళప్రసవంబులతో, భ్రమన్మిళిం
దంబులతో, లసద్రస హృదంతరలాలస పాళితో, శకుం
తంబులతో, నిరంత మధుధారలతో, సురభిప్రశస్తితో :

శీత హిమాంతశైశిర విశీర్ణపథమ్ముల నిద్రవోవు - క్షు
ద్రాతిదరిద్ర కీటకము - రంగులరెక్కల "సీతచిల్క" యై
స్ఫీతసుమ ప్రదేశముల చేరెను: —కాకకులాయ పోషిత
మ్మై, తలయెత్తె కోకిలయు, మాధవకాల మహత్త్వగీతితో.

మృదులదళాభిరామ కదళీ వనవీధి విహారిణీ ! హరి
ద్ర దళ విరాజమాన హరిత ప్రధితోర్వి నివాసినీ ! రసా
లదళ విశాల కాననధరా పరిచారిణి ! నారికేళ ప
త్రదళ వికల్పితోన్నత పథాఽఽగతవై, శుభమీవె పచ్చగా !

అంచిత గానసమ్ముఖ ఖగాంకితమౌ వనమంత, నిన్ను కీ
ర్తించును - మా సరోవరము శ్రీ జలజోత్పల మాలికల్ సమ
ర్పించును - మా గృహమ్ము సుపరిస్ఫుట వాఙ్మధు మంత్రయుక్తి అ
ర్చించును - మా హృదంతరములే భవదర్చనకైన ద్రవ్యముల్ !

శీతల శీకర ప్రకరసేకముగా - పృథు భద్రహస్తివై,
శ్రీతరుణీ ! భవన్మకుట శీర్ష మహోన్నతవీధి కెత్తెదశ
పూతకవిత్వ దక్షిణ నవోదక పూర్ణకరమ్ము— రావె, గం
[illegible] - కాంచనపంకజ సౌరభమ్ముతో.

నీలసుధామలోదక వినిర్గత శీతతుషార సంప్రసా
రాలసయాన ! రాగదె ; నవాబ్జపరీమళ మారుతోర్మికా
లాలసయాన ! రాగదె ; తరంగ చలన్మృదుహంసగీతికా
లోల సుయాన ! రాగదె ; సరోగృహిణీ ! వరదాభిముద్రవై !

శ్రవణానందకరమ్ము మన్మృదుగళ ప్రస్తారితమ్మైన గీ
త, వినీతమ్ముగ విన్నడుగా - భవదుదాత్త స్వర్ణమంజీర నా
ద వినోదమ్ముగ - ఓ ముకుందగృహిణీ ! త్వన్మంజుహాసాంశు రా
గవతుల్ ఫాలకపోల దివ్యరుచు లాకల్పించు, మద్భాగ్యముల్.

హరిత వసంతమాస మటు హార్దికమార్దవ పల్లవాళి య
ట్లు— రుచిరపుష్పగుచ్ఛ మటు లుజ్జ్వలసత్ఫలపాళి యట్లు - కే
సర వకుళామ్ర బిల్వ నవజాతికుజాతిమనోజ్ఞమౌ - వనాం
తరముల రావె, రాగపరిధాన ! భవాలు - పరీమళింపగా.

గ్రీవాభంగ మనోజ్ఞ హంసమసృణ క్రేంకారనాదమ్ముతో
దేవీ ! పిల్చెద - మద్గృహాంత మధురాతిథ్యమ్ము - చేకోఁగదే !
భావోన్మేష సరస్తటోపరి తరుప్రాంతాంతరమ్మందు - దీ
క్షా వైవిధ్య సుపక్వభక్తిఫలముల్ కైకోగదే, రాగదే !

అతినీలోజ్జ్వల లోహితద్యుతితనూవ్యాకీర్ణ లోకాళివై,
వ్యతిపాతైక నిరంత కష్ట బహుదైన్యధ్వాంతమౌ చిత్త మం
దతి విజ్ఞాన మరీచిమాలికలు సంధానించు - నీవార శూ
క తను శ్రీకుడు - శ్రీ హృషీకపతి హృద్గ్రైవేయ మాలాకృతీ !

నీవు వసంతమాసమవు నే నొక కోకిల; నీవు మాధవీ
పావనవల్లి నేను మధుపమ్మను ; నీవు సుశీత భూజ మే
నో, విహగమ్మ ; నీవు హరితోజ్జ్వల శాద్వల మే మృగమ్మ ; నీ
వే వనదేవి - వధ్యగతుడేను - భవత్కృప నాశ్రయించెదన్.

—భార్గవీగీతలోని "వనఖండిక" నుండి.

పాత్ర సంభాషణమే కదా పంచమవేదము !— నాటకీయశైలి అనగా నాటకీయతాముద్రితమైన పాత్ర సంభాషణ ప్రతిఫలనము. మఱి సంఘర్ష ణాత్మకమైన సంఘటనానైపథ్యము నాటకీయత. అనగా ప్రతిపకలాపముల సంవాదరూపము. అట్టి సంవాదరూప సంభాషణమే నాటకీయశైలి. అది వస్త్వపేక్షాఫలసిద్ధి కలదేగాని, కవి ఆత్మీయతా సంబంధి కాదు. శకుంతలాదుష్యంతుల ఘట్టము నన్నయ వ్రాసినది నాటకీయము. పాండవ కౌరవ జననప్రకారము తిక్కన వ్రాసినను ఆఖ్యానక శైలియే అపరిహార్యము. నాటకీయతాముద్రిత వస్తువైన కర్ణజననప్రకారము నన్నయ ఘంటమున నాటకీయశైలీపరకోటి.

పాత్రసంభాషణమునకు పరిణాహికషముశ్రవ్యత. అది ఉచ్చారణతసహజతాగుణప్రకటనయోగ్యతకల సజీవలక్షణమువలన సాధ్యము. భాస కాళిదాస భవ భూతుల రూపక సంభాషణల వైభవమట్టిది. తాదృశ మైన రచనయే నన్నయ వచనములోని కలకండ పలుకుల కలకంఠ స్వరము. నన్నయభట్టు నాటకీయ శైలి కిదొక నాటకరూపోదాహరణము. ఇందలి విసంధి ఇప్పటిది.

"కద్రువ : (వినతంజూచి) చూడవె ! అల్ల— అతి ధవళంబైన అశ్వంబునందు సంపూర్ణచంద్రునందు నల్లయుంబోలె వాలప్రదేశంబున నల్లయైయున్నది.

వినత : (నగి) నీ వేకన్నులం జూచితే యక్క?— ఎక్కడిది నల్ల ?—ఈ అశ్వరాజుమూర్తి మహాపురుషు కీర్తియుంబలె, అతినిర్మలంబై యొప్పుచున్నయది.

* * *

(పన్నిదంబు సలుచిన)

వినత : అయ్యశ్వంబు డాసి చూతము రమ్ము.

కద్రువ: ఇప్పుడు ప్రొద్దులేదు; రేపకడచూతము."

ఆకృతికూడ అమరినది. అచ్చ మిద్దఱు స్త్రీల అతి సహజమైన సంభాషణమున కిది దర్పణప్రతిఫలనము. ఈ సహజతాగుణమే సంభాషణకు సజీవలక్షణము. సజీవలక్షణ సముజ్జ్వలమైన సంభాషణకు అచ్చపు సంఘర్షణ అంతరవేదిక యైనచో నది సమగ్రమైన నాటకీయశైలి. అనగా ప్రతిపకలాపము ప్రతీయ మానముగ సంభాషణాంతర్గతము కావలెను. సంఘర్షణ ప్రాతిపదికమై సంభాషణల విజృంభణ మొక శిల్పమే కాదు. ప్రతీయమాన ప్రతిపకలాప నిరూపక నిర్మాణ మార్మికతయే శిఖరశేఖరమైన శిల్పరచనము. అట్టిదీనన్నయ వచనము. ఇట, కద్రువ 'సంపూర్ణచంద్రునందు' అన్నది. వినత 'మహా పురుషుని కీర్తి' అన్నది. ఆ రెండు మాటలలో కలదు అంతరమైన సంఘర్షణ. సాధారణముగా 'కీర్తి' ఉప మేయము. 'చంద్రకాంతి' ఉపమానము. కద్రువ ఉపమానములో 'జాగ్రత్త' పడినది. అయినప్పటికి ఆ ఉపమానమునకు ప్రసిద్ధమైన ఉపమేయమై. అది మఱల ఉపమానములోని దోషము లేని ఉప మేయమైన, మహాపురుషుని కీర్తిని ఉపమానము చేసికొన్నది వినత. ఆ చేసికొనుటలో నున్నది ఆమె సోల్లుంఠనము అనగా నది అంతర ప్రవృత్తి. వినత గడుసరి. కద్రువ తెలివైనది. వెంటనే పందెము సలుచినది. అశ్వము తెలుపునలుపుల చర్చను ఆకద్రూవినతల అంతర విజిగీషా హేతువైన సాపత్న్యమిట ప్రతీయమానము అది సంఘర్ష ణాత్మకమైన నైపథ్యసంఘటనము. సంభాషణగత మైన సంఘర్షణగ్రథన మిది 'ఉదాత్తరసాన్విత' మైన నాటకీయశైలి. వినత నగి అనుటలో నొకవిశిష్టత. అంతరప్రవృత్తి కది ఆంగికచేష్ట. ఆకృతి, ఆంగిక చేష్ట, అంతర సంఘర్షణ, సజీవసంభాషణ కలదే అసలైన నాటకీయశైలి.

అంతరమైన సంఘర్షణలేని బాహిరమైన సంఘ టన బాహాటము. అట్టి సంఘటనలోని సంభాషణ లును నాటకీయ ధోరణులు. అవికూడ నన్నయకు ఆమ్నాతపూర్వములు.

బ్రాహ్మణుడు: పెద్ద కాలంబునకు ఈయిలు వరుస నేడు మాకువచ్చిన, ఇచ్చిబుతవాని, నారాతసు నకు భక్ష్యంబుగా బుచ్చవోవను: పన పోయెదను.

కుంతి : అయ్యో! దీనికి సంతాపింప వలవదు. ఈయాపద దలుగునట్టి యుపాయంబుగంటి. నీకుం గొడుకొక్కరుండ, వాడును గడుబాలుండు. బలి గొనపోవ నర్హుండుగాడు. నాకు ఏవురు కొడుకులు కలరు. వారలలో నొక్కరుండా రక్కసునకు భవదర్థంబుగా బలిగొనిపోయెడును.

బ్రాహ్మ : (చెవులు మూసికొని)......

సజీవమైన సంభాషణలే కదా!—పైవచనమున "అని దుఃఖించి" అని కలదు. అది స్పష్టార్థ ప్రతిపత్తికి. అనగా రంగసూచనవంటిది. అన్న తర్వాత ఆదుఃఖము కాదు; సంభాషణలోనే ఆదుఃఖము సమ్మిశ్రితము. 'పెద్దకాలంబునకు' అనుమాటలోనే ఒక ఆశ్వాసనము. 'మాకువచ్చిన' అను మాటలోని అవస్థ మౌనగాద్గద్యము. అసమాపక క్రియా ప్రయోజన మది. 'ఏన పోయెదను' అనుచోట అవధారణార్థకము హృదయవిదళనసహము. ఇల్లే కుంతి అవస్థ. ఆమె ఎంత దానవీరయైనను, అపత్య పరిత్యజనమొక అవస్థయే. తదవస్థాప్రకటనార్థము ఆమె సంభాషణకు వచనరచన విశ్లథరూపము. అనిచెప్పి ప్రతిజ్ఞ అనైచ్ఛికము కాదు. కనుకనే ఆమాట ఏకధాటీవచనము. 'భవదర్థంబుగా' అను బరువైన సంస్కృతపద సంయుక్తాక్షర సంకలనము సత్యోద్ఘాటన సహకారి. ఆరెండు పాత్రల మనస్స్థితికి, ఈరెండు సంభాషణలు రెండు మణిదర్పణములు. ఇట్టిరచనము నాటకీయశైలి. అది 'ఉచ్చారణదక్షుడగు వానిచేత అభిహితంబు' కావలసినది. అట్టి నాటకీయశైలి ఆద్యంతము నన్నయ పద్యముల, గద్యముల ఆణిముత్యాల హారము. నాటకీయశైలి గౌణమనుట గౌరవ దూరము. సర్వాంధ్రకవి సమాజము నన్నయ గురుపీఠమునకు నతశీర్ష నమస్కృతము.

కతిపయాక్షర పరిమితమైన అల్పసమాసము, క్రాంతముద్రాక పదద్రాఘిష్ఠ ధారావాహికమైన దీర్ఘసమాసము, ధ్వన్యుపస్కారకములగు ధన్యజీవులని ఆనందవర్ధన మతము. ప్రతీయమానమగు అర్థమే సమాస ప్రయోజనము. 'మహాసముద్ర' మనునది మామూలు పదము. ఒక మహాసముద్రమును ఒకరికి తెలియజేయుటకు ఉచ్చారణలో ఒత్తిపలుకుట, దీర్ఘము తీయుట మానవసహజము. ప్రయత్నమది సముద్ర పరిణాహ గాంభీర్యాది గుణ ప్రకటనార్థము. ఉచ్చారణలోని ఊనిక, దీర్ఘము అర్థస్ఫూర్తికి ఆకాంక్ష. అది రచనకు అలభ్యము. అందుచేత, ఉదాత్త స్వరానుకూలమైన దీర్ఘద్విత్వ సంయుక్తాక్షర పౌనఃపున్యముతోడి దీర్ఘ సమాసరచన మొక శిల్పలాఘవము. "కరిమకర నికరాఘాతజాతవాతోద్ధూత తుంగ తరంగాగ్ర సముచ్చలజ్జలకణాసారచ్ఛటాచ్ఛాదిత గగనతలంబైన దాని" అని మహాసముద్రమునకే ఒక సమాసవచనము నన్నయ రచనము. సరిగాచూచిన తరంగ సంచలనమే ఈ సమాస రచనలో మూర్తిమంతము. ఆ సముద్రము ఆకాశమంత విశాలమనుటకు పలయు ఆంగిక వికారమంతయు అక్షరగతము. ఉచ్చారణలోని ఊనిక, స్వరగానములను, ఈ ద్విత్వ సంయుక్త దీర్ఘాక్షర సంధానము. దీర్ఘము తీయకుండగనే, దీర్ఘ సమాసమిది తదర్థద్యోతకము. అనేక దశలలోని అనేక విధములైన ఔచ్చారణాద్యనేక సహజాంశములకు వ్యంజకమైనట్టి సమాసమే సమాసము. అర్థవంతము కాని ఆకాశ పదయానము అనవసరాడంబర వాగ్వ్యయము. సార్థకమైన, సావధికమైన సమాస రచనము నన్నయ్య వచనమందలి వైభవము. నన్నయ ప్రతి సమాసము ప్రత్యేకార్థ ప్రతిఫలకమైన రత్నఫలకము.

మఱొక సమాసము : "అవిరళగళిత నయనోదక బిందుసందోహ పరిపీడ్యమాన పీనస్తన పరిధానాంతర-" ద్రౌపది సభకు వచ్చిన సందర్భములోని సమాస మిది. ఆమె అథోనీవి. ఏకవస్త్ర. ఆ స్థితిలో కౌరవేశ్వరునికడకు ద్యూతపణముగా సభలోనికి రావలసినదిగా ప్రాతికామి పిలుపు!— ఎవరు ముందోడినదని ఎట్లో ద్రౌపది వేసినది ఎదురు

ప్రశ్న. సందిగ్ధమయిన సమస్యకు అందఱి సన్నిధినే అవధానమని మఱల ఆహ్వానము! దుర్యోధను దుశ్చేష్టిత మది భయజనకము. (వెలిచి) తదవస్థ, శోక పరితాప దందహ్యమాన దావాగ్ని మధ్యము. పైగా ఆ స్థితిలో సభాప్రవేశము లజ్జావహము. ఏవంవిధ భయ శోక బాధామయ లజ్జాభావ శబలతా హృదయభారమునకీ సమాస బంధనము. అనగా నది మనస్థితికి అచ్చపు మణిదర్పణము.

అతి దీర్ఘ సమాసములకంటెు, అల్పసమాసములే నన్నయ వచనములలో అధికము. అవికూడ అలతి పదముల అలరెంపుతోడి అనుసంధానములు. సంస్కృతాంధ్ర సమ్మిశ్రణ మది వర్ణనస్థలములందే వైభవోద్దిష్టములు. ఆ వర్ణన స్థలములును అరుదు.

1. కుమారాస్త్ర విద్యా సందర్శనరంగ వర్ణన. (ఆ. ప. ప. ఆ. 5)
2. వారణావత వర్ణన. (ఆ. ప. ప. ఆ. 132)
3. ద్రౌపదీ వివాహమండప వర్ణన. (ఆ. ప. స. ఆ. 281)
4. యుధిష్ఠిరద్యూత పరాజయ వర్ణన. (స. ప. ద్వి. ఆ. 177)
5. ద్వారవతీ వర్ణన. (అర. ప. ప్ర. ఆ. 158)
6. ద్వైతవన వర్ణన. (అర. ప. ప్ర. ఆ. 201)
7. ఊర్వశీ ఉద్దీపన విభావ వర్ణన. (అర. ప. ద్వి. ఆ. 347)
8. హిమవత్పర్వత వర్ణన. (అర తృ. ఆ. 77)

అసలు వర్ణనలు అతి ప్రగల్భములు. ప్రగల్భతకు అక్షరరమ్యత. వస్తు సౌందర్య వ్యంజనమునకు శబ్ద సౌందర్యరంజనము రచనాశిల్పము.

కుమారాస్త్ర విద్యా సందర్శన రంగవర్ణన :

"అనిన నట్లచేయుదునని ధృతరాష్ట్రుండు కుమారుల విద్యాసందర్శన రంగంబు రమ్యంబుగా జేయింపుమని విదురుం బంచిన నతండు వల్లెయని శాస్త్ర విహిత ప్రమాణోపేత నృత్తాయామంబును నపాకృతవృక్షగుల్మ వల్మీక వల్లీకంబును నంగీకృత పూర్వోత్తరప్లవంబును సమీకృత నిమ్నోన్నత ప్రదేశంబును దూరీకృత కంటక పాషాణశల్యాశకలంబును విరజీ(శీ)కృత రజోధూసర స్థలంబును విరచిత బహువిధ ప్రేక్షాగారమంచక ప్రపంచంబును నానా ధ్వజ నవ పల్లవతోరణ చందనమాలాలంకృత ద్వార దేశంబును ప్రతిదిశనిర్వర్తిత శాంతికబలి విధానంబు నుంగా జేయించినం బంచాంగశుద్ధదిన శుభముహూర్తంబున ధృతరాష్ట్రుండు గాంధారీ పురస్సృత దేవీ శతపరివృతుండై వివిధ భూషణ భూషితానేక విలాసినీనివహసంబుతో జనుదెంచి విలంబిత కదంబక స్థూలముక్తాఫలదామ రమణీయంబై యాబద్ధమరకత వజ్రవైడూర్య పద్మరాగ ప్రవాళ ప్రభాప్రకర వ్యతికర విరచితాపూర్వ సుర చాప చారు గౌరవంబై యతిమనోహరంబైన శాతకుంభ మయ ప్రేక్షాగారంబున నున్న....."

ఇది నాగరకులైన నవీనకుమారుల క్రీడారంగమునకు చూడారత్నము కదా! రాజమహేంద్రవరము నేటికిని క్రీడారంగకేంద్రమే! మఱి నాడు రాజరాజనరేంద్రుని సమక్షమున ఆంధ్ర యువకుల కందుక క్రీడ గాక, కార్ముకక్రీడ నన్నయభట్టు స్వయముగా సందర్శించిన సందర్భమేమో!— నేటి తెలుగు వీరుల బంతియాటకును, —పొడవు వెడల్పుల లెక్క, సమతలముచేయుట, రాయి రప్ప తేరుట, ముల్లుముట్ట తీయుట, దుమ్ము ధూళి తొలగించుట, ప్రేక్షకులకు ప్రత్యేకాసనములు, నిలువుజీతములు, రత్నమాలికలు లేకపోయినను రంగుజెండాల వేలికలును—తప్పనిసరి తతంగమే కదా! అయినను కుమారాస్త్రవిద్యా సందర్శన రంగమున, మరకతమాణిక్యాది రత్నప్రభలు, ఇంద్రధనస్సు లగుట ఇప్పటివారికి అతిశయోక్తి! అది కాలదోషము. దృష్టిదోషము కూడ. ఇంతకు వర్ణనములు ఇంతింతలో, అంతంతలో వాస్తవ ప్రకృతి కలవనుట గమనార్హము. ఆంధ్ర సారస్వతమున వర్ణనాగతమైన సమాస వచనమునకు ఆద్యప్రకృతి కాదంబరీవచన సమాసవల్లనము.

"తస్మిన్నపి చలతి చటుల తురంగబల ముఖర ఖురరవ బధిరీకృత భువనాంతరాళా బలభరప్రచల వసుధాతల దోలాయమాన గిరయోగళన్మదాంధ గంధ గజదాన ధారాంధకారాః సంసర్పదతి బహుళ ధూళిపటల ధూసరిత సింధవః ప్రచలపదాతి బల కలకలస్ఫోటిత కర్ణవివరాః సరభసోద్ఘుష్యమాణ జయ శబ్దనిరంతరాః ప్రోద్ధూయమాన ధవళ చామర సహస్ర సంచ్ఛాదితాః పుంజిత నరేంద్ర బృంద కనక దండాతపత్ర సంఘట్ట నష్ట దివసాః దశదిశో బభూవుః."

ఈ దృశమైన సమాస వచనము ఉత్కలికా ప్రాయమని సంస్కృతాలంకారికుల ప్రతిపాదనము.

ఇక వృత్తగంధివచనము. ఇది లాక్షణికుల వచన భేదవర్గీకరణమున ఇతోధిక విశేషము. "పద్య భాగవద్వృత్తగంధి" అని వామనుని కావ్యాలంకార సూత్రవృత్తిలోని లక్షణము. "వృత్తభాగ యుతం పరమ్" అని విశ్వనాథుని సాహిత్య దర్పణమునందలి లక్షణము. అనగా "పద్యభాగవత్" అను స్థలమున మతుప్రత్యయార్థము స్పష్టము. "వృత్త భాగయుతం" అను లక్షణము తదుపబలకము. కాగా పద్యభాగములతో కూడిన వచనము వృత్త గంధి వచనమని సులభగ్రాహ్యము.* వృత్తగంధి లక్ష్యము లివికూడ స్పష్టము.

"(యథా-) పాతాల తాలు తలవాసిషు దాన వేషు" ఇతి. అత్ర హి వసంతతిలకాఖ్యస్య వృత్తస్య భాగః ప్రత్యభిజ్ఞాయతే.

—కావ్యాలంకార సూత్రవృత్తి.

(యథామమ-) సమరకండూల నిబిడ భుజాదండ కుండలీకృత కోదండశింజినీటంకారోజ్జాగరిత వైరి నగర - ఇత్యాది.

అత్ర 'కుండలీకృత వేదండ' ఇత్యనుష్టు బ్వృత్తస్యపాదః. 'సమరకండూల' ఇతి చ ప్రథ మాక్షర ద్వయరహిత స్తథైవ పాదః.

—సాహిత్య దర్పణమ్."

మరి నన్నయ వచన మధ్యమున యతిమైత్రికల తేటగీతిపాదముతో కూడిన వృత్తగంధి వచన మిది :

"వ. అని ధృష్టద్యుమ్నుండు మూగిన రాజపుత్రు లకు నెల్ల నెఱుంగంజెప్పి ద్రుపదరాజపుత్రింజూచి యఖిల జలధివేలావలయవలయిత మహీతలంబునం గల రాజనందను లెల్ల నీ స్వయంవరంబునకు వచ్చిన వారు......" (ఆ. ప. స. ఆ. 170)

అఖిల। జలధివే। లావల। యవల। యితమ
హీత। లంబునం। గలరాజ।

ఇట్లు వచనాంతమున కల వృత్తగంధి—

"అరయను। మన్నంత। ననతిదూ। రంబున..."
(ఆ ప. ష. ఆ. 71)

---

*సులభగ్రాహ్యమైన అర్థమిది. "పద్య పాదభాగముల కలయికతో వృత్తముల వాసన దోపించుచుండు వచన రచనము వృత్తగంధి .... .... వృత్తభాగములతో గూడుకొన్నట్టిది." అని కీ. శే. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు స్పష్టపరచిన సంగతియే. (సింహావలోకనము. పుటలు 87, 88.) అయినను వృత్తగంధి వచనము అనగా, "పద్యభాగము లతో ప్రారంభమై, వృత్తములని తోపింపజేయు గద్యరచన" అని శ్రీ నిడుదవోలు వేంకటరావుగారి నిర్ణయము. (ఆంధ్ర వచన వాఙ్మయము. పుట. 4.) మరి. "పద్యభాగవత్" అను స్థలమున మతుప్రత్యయమునకు "ప్రారంభమై" అను వేంకటరావుగారి "లాక్షణిక సంప్రదాయార్థము" నకు వారి గ్రంథాంతర లక్ష్యసమన్వయ మిదికూడ గమనార్హము. "నన్నయ వచనమును ప్రారంభించు పట్టుల పద్యమువలెనే నడిపించును...." (తెనుగు కవుల చరిత్ర - పుటలు 120-123) మరి, నన్నయ వచనమును "ప్రారంభించు పట్టుల" సర్వత్ర "పద్యమువలె నడిపించ" లేదు. "ప్రారంభించని పట్టుల" అనగా వచనమధ్యమున, వచనాంతమున "పద్యమువలె నడిపించక" పోలేదు. అయినను మరి అట్లు భ్రాంతిపడి ఇట్లు లక్ష్యలక్షణ సమన్వయము చేయుటే గాక, ఏతదర్థమునకు నన్నయ భారతమును "నన్నయనాటి లిపిరీతిని, నుచ్చారణరీతిని ముద్రింప" వలె నని నిడుదవోలు వేంకటరావుగారు నిర్ణయించుట ఎట్టిదో సాహిత్యవేత్తలు సమాలో చింతురుగాక !

మరికొన్ని శబ్దములున్నవి. ఆసుపత్రి మొదలైనవి. ఇవి తద్భవముల వంటివి. వ్యవహారములో నలిగి తెలుగురూపమును తెచ్చుకొన్నవి. వీనిని తెలుగుశబ్దములక్రింద వాడకూడదన్న దుస్సాహసము నాకు లేదు.

ఎవరైనను ఎదుటివాడన్నదానిని సరిగా నర్థము చేసికొని విమర్శించుట మొదలు పెట్టవలయును. వాడననిదానిని వానిపై నారోపించి వానిని ఖండింపబూనుట యన్యాయము.

'దీనికి 'మేచ్' అయే చీర కట్టుకోవాలి.' (ఆం. ప. 23-9-59 పుట-8). 'కూలింగ్ గ్లాసెస్‌తో' 'తల విదలించి కాంప్లిమెంటిచ్చాడు', 'అమ్మాయిగారు మూడు లెటర్సు రాశారండీ'. 'దో టూ బ్రూటస్ అన్నప్పటి సీజరుముఖంపెట్టి' (ఆం. ప 30-9-59 పుటలు9-11) ఇది తెలుగు భాషయా? ఇవి కూడదని చూపుట పాటివ్యక్తులను పత్రికలను దూషించుట యగునా? బహువచన రూపములకుకూడ ఇంగ్లీషు భాష నాశ్రయించిన ఈ యలవాటు పరిహరించ దగిన దనుటలో దోషములేదు. అది దూషణ కాదు.

జయంతియందు నేను పక్షపాతము వహించుచున్నానన్న భ్రమతో సౌజన్యగా రింత వాదన చేసినారు (జయంతి 12 చర్చావేదిక) కాని నిజముగా నాతో వారి కెక్కువ అభిప్రాయభేద మున్నట్లు లేదు. జయంతి 11 వ సంచికకు వ్రాసిన నాకు ఆ సంచికలోనే ప్రచురింపబడిన కథలలోనున్న ఇంగ్లీషు శబ్దములు కనుగొను దివ్యదృష్టి లేదుకదా! అవి నేను 12 వ సంచికలో చూపించితిని కూడ. సౌజన్యగారు దేనిని దూషణ యనుచున్నారో అది జయంతి సంపాదకులయందు ప్రయోగించబడ లేదనుటకు వీలులేదు. సాక్ష్యముగా ఇదివరకు ప్రచురింపబడిన సాహిత్యధారా భాగములున్నవి.

పైగా నేటి తెలుగు పత్రికలనిండ వాడబడిన ఇంగ్లీషు శబ్దముల పట్టిక లిచ్చుటకు ఎవరికిని సమయము చాలదు. ఆ దోషము ప్రధానముగా ఎక్కడ కనబడుచున్నదో అక్కడ చూపించినచో చాలును.

జయంతి 12 లో కూడ షాపు-సోపు (పుట 87) వంటి ఇంగ్లీషు శబ్దము లున్నవి. ఇవి పరిహరింప దగినవనుటలో అభిప్రాయ భేద ముండదు. కథాగతమైన యొక పాత్ర మనోలక్షణమును ప్రతిబింబించుటకు వాని నోట కొన్నికొన్ని ఇంగ్లీషు శబ్దములు పలికించుట వేరు. కథకుడు తానై వ్రాయుట వేరు.

ఇంకొక రకమైన రచన యున్నది. అది ఆంధ్రాంగ్ల రచన. తెలుగు వ్రాయుచు మధ్యలో ఇంగ్లీషు వాక్యములు ఆ లిపిలోనే వ్రాయుట. "అనుభవాలు పాతబడి కొత్తదనం షాసిపోతుంది. 'హెవెన్ లైస్ అబౌట్ అజ్ ఇన్ అవర్ ఇన్ఫాన్సీ' (దాశరథి, స్రవంతి - పుట 40). రసాత్మక వాక్య సిద్ధాంతమువలన ఈ పని జరుగదు. 'పొయెట్రీ ఇజ్ అన్ ఇంటర్‌ప్రెటేషన్ ఆఫ్ లైఫ్...'(దుర్గానంద్-పుట 61) ఉత్థానపతనముల మీదనుండి వచ్చు 'ఆర్ట్ ఆఫ్ యునైటింగ్ ప్లెజర్' పాశ్చాత్యులకు కూడా కవిత (దుర్గానంద్ - పుట 61). ఉపమానానికి కొంత 'మాగ్జిమమ్ పవర్' ఉంటుంది. 'ఈ గ్రంథిని 'డైరెక్టుస్పీచ్' గా విప్పితే...' (దుర్గానంద్-పుట 69). ఇంకొక రకంగా చూస్తే 'థాట్' ను చెప్పేటప్పుడు క్లుప్తీకరణ, 'ఫీలింగు' ను చెప్పేటప్పుడు విపులీకరణ అవసరం. (దుర్గానంద్ - పుట 69) ఈ ఇంగ్లీషు వాక్యములు, శబ్దములు అన్నియు అ భాషా లిపిలోనే వ్రాయబడియున్నవి.

ఇంగ్లీషు శబ్దములు స్వేచ్ఛగా తెలుగులో నేల సిమిడిపోరాదని ప్రశ్నించు సౌజన్యగారు, ఆ భావముతో అంగీకరించు ఇతరులు ఈ రకమైన రచనల నామోదింతురా? అయినచో ఉర్దూ తెలిసినవాడు, రష్యను భాష తెలిసినవాడు, ఫ్రెంచిభాష తెలిసినవాడు, జర్మను భాష తెలిసినవాడు ఆయా భాషల లిపులలో అక్కడక్కడ మహాపురుషులన్న వాక్యములను. ఆయా భాషా విమర్శలలో నలిగిన శబ

ములు అర్థవివరణ లేకుండ వాడుట కభ్యంతర ముండకూడదు.

ఇంగ్లీషు అంతర్జాతీయ భాషకదా! ఈ భాషలన్నిటికన్న దానికెక్కువ ప్రాముఖ్యమున్నదని వాదింపవచ్చును. అసలది అంతర్జాతీయ భాషయగుటయే తప్పు. ఇంతవరకెప్పుడు ఏదియు స్థిరముగా అంతర్జాతీయభాష కాలేదు. కొన్ని ఏండ్లక్రిందివరకు ఫ్రెంచి అంతర్జాతీయభాష. అప్పుడు ఫ్రెంచికున్న స్థితికూడ ఇప్పుడింగ్లీషుకు లేదు. ఐక్యరాజ్య సమితిలో ఐదారుభాషలు అధికారికమైనవిగా అంగీకరింతురు. యూరపుఖండములోనే తూర్పుదేశములలో ఇంగ్లీషుభాషయం దాదరము చూపింపరు. రష్యాసంగతి చెప్పవలసిన యవసరము లేదు. ఫ్రాంసు జర్మనీ దేశస్థులు తమ భాషముందు ఇంగ్లీషుభాష ఎందుకును పనికిరాని దనుకొందురు. ప్రాగ్దేశములకు వచ్చినచో చైనాకు ఇంగ్లీషుయెడల వైముఖ్యమున్నది. చైనా అనుయాయులకున్నది. ఇన్ని దేశములచేత నిరాకరింపబడిన ఇంగ్లీషు అంతర్జాతీయ భాష యెట్లైనదో భగవంతునికి తెలియవలయును. లేనిచో ఈ దేశములోని త్రిశంకువులకు తెలియవలయును.

ఒకవేళ అది ప్రస్తుతము అంతర్జాతీయ భాషయైనను ఏ భాషకును అంతర్జాతీయ భాషగా స్థైర్యము లేదని ప్రపంచచరిత్ర చెప్పుచున్నది. అమెరికనుల మాతృభాష ఇంగ్లీషు కానిచో ఇంగ్లీషు బండారము ఇదివరకే బయటపడి యుండెడిది. చెప్ప దలచిన దేమనగా భాషయొక్క అంతర్జాతీయత్వము రాజకీయ పరిస్థితులపై చాలవరకు ఆధారపడి యున్నది. రాజకీయ పరిస్థితుల కతీతముగా సర్వదేశములలో కేవలము భాషాబుద్ధితో తద్గతమైన విజ్ఞాన సముపార్జనాదృష్టితో అభ్యసింపబడు భాష సంస్కృత మొక్కటే.

కాదు. ఇంగ్లీషు ముమ్మాటికి అంతర్జాతీయ భాషయే యని యొప్పుకొందము. ప్రపంచములోని ఇతర సభ్యదేశములకు లేని ఈ అంతర్జాతీయ భాష అవసరము ఒక భారతీయులకే, ముఖ్యముగా తెలుగువారికే ఉన్నదా? ఉన్నదన్నచో ఆ మిగిలిన భాషలకున్న శక్తి తెలుగుభాషకు లేదన్నట్లు, ఇప్పటి సంగతికాదు. ఒక నలువదియేండ్లు వెనుకకు పోయి చూతము. రష్యాదేశములోని సీతాకోక చిలుకలు, నేటి మన దేశపు సీతాకోక చిలుకలవలె మాతృభాష పరిహరించి పరభాషలో మాటాడెడి వారు. విప్లవము మరునాటి నుండి పరభాషా ప్రచారకులకు ప్రాణగండమైనది. పరభాషా సాహాయ్యము లేక ఆ భాష యెట్లు నిలువద్రొక్కుకొనగలిగినది? ఒక్క త్రుటిలో ప్రపంచమును క్రిందుమీదు చేయగల మహావిజ్ఞానశాస్త్రవేత్త లక్కడ యెట్లు జన్మించుచున్నారు?

ఇదియంతయు సౌజన్యకు సమాధానము గాదు. ఆయన యీ ప్రశ్నలు లేవనెత్తలేదు. ఇంగ్లీషు పరిహరించి బ్రతుకలేమనుకొను దాస్యభావ పరాంకోటిమతులు ఉన్నారు. కాబట్టి ఇదియంతయు చెప్పుట, ప్రక్కవా డాడించినను ఊహాయాడక పోవుట దాస్యభావములో మునిగితేలువాని ప్రధాన లక్షణము. ఈ దేశమును పాలించినవారు చదువుకొన్నవారి ఊహలను దిమ్మెక్కునట్లుగా తాడించి వదలిపెట్టిరి. అట్లు తాడితులైనవారు విద్యాబోధ ఇంగ్లీషులో జరుగవలయునని రాజ్యభాష ఇంగ్లీషే ఉండవలయునని గోలచేయుదురు.

దేశభాషలలో శాస్త్ర పరిభాషకు తగినపదములు లేవని ఒక్కటే గోల. ఆ శాస్త్రపరిభాషా పదములు ఇంగ్లీషుశబ్దములనుకొనుట మరికొంత యజ్ఞానము. శాస్త్రబోధలో ప్రధానమైనది విషయపరిజ్ఞానము కాని భాషా వైదుష్యముగాదు. విదేశీయ విశ్వవిద్యాలయములలో వేదాంతశాస్త్రము ఏ భాషలో బోధింతురు? సంస్కృతములో బోధింపరు కదా? ఆ శాస్త్ర పరిభాషకు తగిన పదములు ఆయా భాషలలో నున్నవా? ఆత్మ, జీవుడు మొదలైన శబ్దములను వా రేమందురు? అట్లే పరిభాషా శబ్దముల నెవరైనను ఎరువుతెచ్చుకొనవచ్చును. ఆ పరిభాషా

శబ్దములను వదలి మిగిలిన విషయ మెవ్వరైనను ఏ భాషలోనైనను చెప్పవచ్చును.

ఇంత గహనమైన వేదాంతశాస్త్రము పాశ్చాత్య భాషలలో చెప్పబడుటకు వీలుండగా వట్టి సాహిత్య సంబంధములైన విషయములను చెప్పుటకు ఇంగ్లీషు నాశ్రయించుట తప్పనిసరి యనుట విచారితరమణీయము కాదు.

మనలో కొందరు ఇంతగా అపరిహార్యమనుకొనుచున్న ఇంగ్లీషు భాషను గురించి బెర్నార్డుషా 'పిగ్మాలియన్' అన్న నాటకమునకు పీఠికలో ఇట్లు వ్రాసెను: “ఇంగ్లీషువారికి తమ భాష యందు గౌరవములేదు. తమ పిల్లలకు వారా భాష మాట్లాడుట నేర్పరు. వారి వర్ణక్రమము ఎంత ఘోరముగా నుండుననగా ఎవ్వడును దాని యుచ్చారణను తనంత తాను నేర్చుకొనలేడు. ఒక ఇంగ్లీషువాడు తనను ద్వేషించకుండ లేక చీదరించుకొనకుండ మరొక ఇంగ్లీషువాడు నోరు విప్పుటయే అసంభవము. జర్మన్ స్పానిష్ భాషలు విదేశీయులకు కూడ అందుబాటులోనున్న భాషలు. ఇంగ్లీషు ఇంగ్లీషువారికి కూడ అందుబాటులో లేదు.”

విచారకరమైన మరొక వాదన యున్నది. ఏమాత్రము విచారించకుండ నేటివారీ వాదన చేయుచున్నారు. తెలుగులో ఇన్ని సంస్కృత శబ్దములున్నవి కదా! ఇంగ్లీషు శబ్దము లుండుట కభ్యంతరమేమి యని? ఆధునికుల తర్కమునకు యాథార్థ్యమునకు సంబంధములేదని ఈ ప్రశ్న నిరూపించుచున్నది.

సంస్కృతమును వదలిన తెలుగునకు అస్తిత్వములేదు. ఇది కాలముమీద స్థిరపడిన విషయము. దేశీయ భావములకు తద్భాషకు పరమ వ్యతిరేకులైన మహానుభావుల వ్రాతలోకూడ సంస్కృత మపరిహార్యముగా నున్నది. జన వ్యవహారము వద్దకు పోయి చూచినప్పటికిని వారు మాటాడుభాషలో సంస్కృతమెంతో చెప్పుటకు వీలులేదు. వ్యవహారములో చేరిన ఇంగ్లీషు శబ్దము లున్నవన్నచో అవి అల్పవిషయములకు సంబంధించినవి. భాషయనగా గోడ, బల్లి, చెప్పు, కుర్చీ, టేబుల్, మొదలైన ఈదృశ్శబ్ద పరిమితమే కాదు. అధికాధికములైన విషయము లనేకములున్నవి. రాజభాష యేదైనను, దేశము నేజాతివారు పరిపాలించినను, ఆ విషయములందలి సంస్కృత భాషా ప్రభుత్వమునకు భంగము కలుగలేదు. కలుగుటకు వీలులేదు. సీతారాములు, నలదమయంతులు, ఉదయన వాసవదత్తలు, సావిత్రీ సత్యవంతులు, మొదలైన శబ్దములు లోకారాధనీయ దాంపత్య శోభితులనుగూర్చి తెలుగువారు ప్రయోగింతురు. సర్వభారతీయులు ప్రయోగింతురు. ఇవి కేవల శబ్దములు కావు. వాని వెనుకనున్న కథల నాశ్రయించి ఆ శబ్దముల కాయర్థస్ఫూర్తి యున్నది. పట్టుబట్టి సంస్కృత శబ్దములను పరిహరించి వ్రాయుదమన్నచో ఎంతదూరము వ్రాయుదురు? అచ్చటకూడ తద్భవ శబ్దములను వదలుటకు వీలులేదుకదా? ఈ కథలను వాని నాశ్రయించియున్న భావములను వదలుటకు వీలులేదుకదా? ఇంగ్లీషు శబ్దములు సంస్కృత శబ్దములవలెనే ఏల వాడరాదనుటలో ఈ విషయమంతయు మరచిపోయి వాదించుట యున్నది. భాషాస్వభావమును లెక్కగొనకపోవుట యున్నది. స్వభావముచేత సమానములైన భాషలోనున్న కలయిక స్వభావ దూరములైన భాషలో నుండుటకు వీలులేదు. మరియు జననీప్రాయమైన భాషకు సమానముగా వ్యతిరేక స్వభావముగల భాషను నిలబెట్టి వాదించుట వైయాకరణితో తార్కికుడు వాదించినట్లుండును. సంస్కృతము తెలుగులో నెట్లిమిడియున్నదనగా మాటాడు వానికి చదువు వానికి ఇది తెలుగు కాదన్న భావము పుట్టకుండునట్లు దీర్ఘసమాస భూయిష్ఠమైన పద్యము వినిపింపుడు. ఈ 'తెలుగు' కఠినముగా నున్నదని తెలుగు వాడనునుగాని అది తెలుగే కాదని యనడు.

ఇంకొకటి. అనువాదములకు ఇంత గొప్పదైన ఇంగ్లీషు భాషలోకూడ సంస్కృత గ్రంథములకు వచ్చిన యనువాదములు సర్వత్ర దుష్టముగా నున్నవి. ఎందుచేత ? భాషాస్వభావ వైరుధ్యము చేత. కాని మనవారు సంస్కృతనాటకములకింగ్లీషు యనువాదములు చదువుదురు. తప్పుల తడకయైన కీత్ సాహిత్యచరిత్ర చదివి దానిలో వ్రాయబడినది పరమసత్యముగా విశ్వసింతురు. సంస్కృత నాటకములను గురించి ఆయనవ్రాసిన దోషభూయిష్టమైన పుస్తకమును చదివి ఆనాటకములను చర్చింపబూనుదురు.

ఈలక్షణములు కలవారందరు ప్రజాదూరులు. వారు ప్రజలు మాటాడుభాష మాటాడరు. వారు ధరించు వేషములు ధరించరు. వారి యూహాలకు విపరీతముగా నూహింతురు. మఱల తామే ప్రజా ప్రతినిధులమని చెప్పి గోలచేయుదురు. ప్రజా భాషయం దాదరము కలవారిని, వారు ధరించు నట్లుగా వేసము ధరించువారిని, వారియూహాలు ప్రతిబింబించునట్లుగా వ్రాయువారిని ప్రతీపవాదు లని, అభ్యుదయ నిరోధకులని గేలిచేయుటకు ప్రయత్నము చేయుదురు. వీరి యభ్యుదయశబ్దము ప్రజల నంటుకొనియున్నట్లు లేదు. వారిని వదలి గాలిలోనున్న శబ్దములను గూర్చిన విచారణ యక్కరలేదు.

ఆమాట కర్థస్ఫూర్తియున్నచో వీరిని 'రస ద్రోహు'లని చెప్పవచ్చును. ఎందుకనగా స్వస్థానవేష భాషలయం దభిమానములేనివారికి రసబుద్ధి లేదన్న మాట యట్లుంచి అది యుండుటకే వీలులేదు. ఎందుకు వీలులేదన్నది నాలుగైదు మాటలలో చెప్పుటకు వీలులేదు.

ఇవన్నియు పరమ సామాన్యములైన విషయములు. కాని భేరీపటహాదులు ప్రమోగించి కట్టులతో కాల్చినకాని కుంభకర్ణునికి నిద్రామాంద్యము వదలదు. అదికాక తెలుగుదేశములోని సాహిత్య లోకములోని వారింద్రియాతీతులు అనగా కన్నులు కనబడని, చెవులు వినబడనివారు.

గమ్యస్థానము (ఆర్. ఎం. చిదంబరం భారతి) చక్కనికథ. గమ్యము, తెలియబడని, అర్థమెరుగ రాని ఒక నాగరకత వెంటబడి పరుగెత్తుచున్న వారి యందు హృదయమును కదలించుచున్న దయా భావము ఈకథలోనిండి తొణికిస లాడుచున్నది. మధ్యమధ్య కొన్నిచర్చలు కథావేగమును కుంటు పరచినను చివరచివర కథ మరల బిగువు గూర్చు కొన్నది.

అంగారతల్పము (సోమసుందర్-జయంతి. 12) చక్కగానున్నది. కథ మొదటినుండి చివరవరకు ఒక నూతనపద్ధతిలో పట్టుసడలకుండ చెప్పబడినది.

ముమూర్ష (రావికొండలరావు 23-9-59 ఆం. ప) స్నేహం (తురగా జానకీరాణి ఆం. ప) బాగున్నవి.

అన్నందుకు పరిమాణమునందు చిన్నదైన కథ కనబడినది. (బాజీ-కపర్ది-జయంతి-12) ఆద్యంతములు మనోజ్ఞములుగా నున్నవి.

ముకురాల రామారెడ్డిగారి 'దైన్య మాహేశ్వరము' (స్రవంతి - అక్టోబరు) మెత్తని ఉపాలంభముతో మిక్కిలి మనోహరముగా నున్నది. పద్యములలో వ్యావహారిక ప్రయోగము లింత చక్కగా వాడిన ఈ కవి ప్రశంసాపాత్రుడు. అపభ్రంశముములో తప్ప వ్యవహారభాష యుండనట్లుగా నే డనేకులు వ్రాయుచున్నారు. ఈయన రచన వారికి జవాబుగా నున్నది. అర్థస్ఫురణకు విఘాతము కల్గించు ప్రయోగములు ఇందులోకూడ అక్కడక్కడ లేకపోలేదు. కించిత్ప్రయత్నముతో ఈ రచయిత వానిని తేలికగా పరిహరించ గలడు.

పద్యరచన దానియంతట నదొక విద్య. చక్కగా పద్యము వ్రాయుట తెలుగు కవితా రచనలో నొక భాగము. ఆ ప్రయత్నము ఫలవంతమైన స్థానము 'మహాత్ముడు' (నాగళ్ళ గురుప్రసాదరావు. జయంతి-12).

సంస్కృత రూపకముల అనువాదములు-(సుప్రసన్న. జయంతి-10,11,12)—ఈ వ్యాసములలో మొదట నున్న బిగువు చివరలేదు. సుప్రసన్నగారి కృషి ప్రశంసనీయము. వా రనేక గ్రంథ పరిశీలనము చేసి ఈ వ్యాసములు వ్రాసిరి. ముందు ముందీ మార్గములో కృషి చేయువారి కీవ్యాసములు సహాయపడ గలవు.

అనువాదకు డన్నంతనే స్వీయమైన ప్రతిభ లేనివాడన్న భావము లోకములో నున్నది. ప్రతిభ లేని యనువాదము వన్నె కెక్కదు. మూలమువలె ప్రకాశించదు. వట్టి భాషాపాండిత్యము అనువాదమునకు చాలదు. ఎక్కువ పండితుడైన వాడు చేసిన యనువాదము నిస్సారమై, తక్కువ వాడు చేసిన యనువాదము సారవంతమగుట లోకములో నున్నది. కారణము వారి వారి ప్రతిభలలోని తారతమ్యము.

విమర్శలలో కొంత మొగమోటపు భాష, కొంత డాబుసరి భాష విపరీతముగా ప్రబలినది. ఈ మొగమోటపు భాషకు రేడియో వారు చేయూత నిచ్చుచున్నారు. గుణలేశమైనను లేని పుస్తకమునకు పొగడ్తలు చెప్పి ఇట్లున్నచో మరింత బాగుండెడిది అని విరమించుకొందురు. ఇక డాబులవాడు ప్రతి చిన్న విషయమున కేదో సిద్ధాంతము చెప్పినట్లు నటించును. అందులో సిద్ధాంత మేదియు నుండదు. వట్టి గాలి యుండును. లేనిచో మట్టి. ఈ రెండవ రకమునకు చెందినది రామాయణ కల్పవృక్ష విమర్శ. దాని విషయము తరువాత.

మొగమోటము లేకుండ, డాబుసరి లేకుండ, సూటిగా చక్కగా వ్రాసినవారు అనుముల కృష్ణమూర్తిగారు (విమర్శ. కొన్ని సూచనలు. జయంతి-12). సమగ్రముగా లేదు కాని సుప్రసన్న వ్రాసిన ఈ దశాబ్దపు తెలుగు కవిత (స్రవంతి-అక్టోబరు) కూడ అటువంటిదే. ఇంత చిన్న పరిధిలో ఆ వ్యాసమునకు సమగ్రత్వ మాశించుటకు కూడ వీలులేదు.

మాత్రాచ్ఛందస్సును గూర్చి శ్రీ సి. నారాయణ రెడ్డిగారు (స్రవంతి-అక్టోబరు) వ్రాసినారు. సీస పద్య పాదములను ఇంద్ర సూర్య గణములక్రింద చేసిన విభజన లయను, తాళమును విస్మరించి చేయబడినదని వీరభిప్రాయపడినారు. అట్లు కాక ఐదైదు మాత్రల క్రింద దీనిని విభజింపవచ్చునని వారు సూచించినారు. ఇది విచార్యము. ఈ మాత్రల విభజన అన్ని సీసపద్యములకు బట్టదు. అవ్యాప్త్యతివ్యాప్తి దుష్టము. నాలుగు మాత్రలైన తరువాత ఒక గురువు వచ్చినచోట ఈ లక్షణము ననుసరించి ఏమి చేయవలయునో మాత్రాకవులు సెలవీయలేదు.

మొలకచీఁకటిజలజలరాల్పఁగారాదె
నెఱులు మించిన వీరికురులయందు

ఈ పద్యపాదమును ఐదైదు మాత్రలుగా రెండు సార్లు విభజన చేయువరకు యతిభంగమగుచున్నది. మూడవగతి ఐదు మాత్రలకు లొంగుటలేదు. పూర్వలాక్షణికులు చేసిన విభజనలో యతిభంగమగుటకు వీలులేదు. పాదాంతమున అక్షరములు మిగులవు. ఆ మిగిలిన యక్షరములను లయకో తాళమునకో బలవంతముగా క్రిందికో మీదికో లాగవలసిన యవసరము లేదు. తాళము మన నోటికి లేదుగాని అది యుండవలసినచోట ఉండనే యున్నది. పూర్వ లాక్షణికులు ఈ విభజన విచారించి, విషయము తెలిసి చేసిరి.

లఘువుకు ఒక మాత్ర యన్నమాట నిజమేకాని, 'మాత్ర అంటే ఒక లఘువు' నిజముకాదు. ఈ నిర్వచనము క్రింద 'ఏకమాత్రో భవేద్ హ్రస్వః' అని వ్యాసరచయిత ఉదాహరించినారు దాని కర్థము 'ఒక మాత్ర హ్రస్వమగును' అని కాదు. 'హ్రస్వము ఒక మాత్ర కలది' అని. ఏకమాత్రః అన్నది బహువ్రీహి. ఇది తెలియని వీరి దృష్టిలో పూర్వ లాక్షణికులు విస్మృతిహతులు. శాంతం పాపం!

ఏదియో పరిశోధన చేయుచున్నట్లు, క్రొత్త విషయము చెప్పుచున్నట్లు లోకములో నటింప

వలసిన యవసరము నిజముగా నారాయణరెడ్డి గారికి లేదు. భగవంతుడు వారికి శబ్దములను కూర్చు నేర్పిచ్చినాడు. చక్కని కంఠము నిచ్చినాడు. వ్యాపారమున కవి చాలును.

ఈ రచయిత వ్రాసిన పద్యములు భారతిలో నున్నవి (మనశ్శైశవము) పద్యములలోని భావము హృదయంగమముగా నున్నది. పద్యరచన కూడ బాగుగానే యున్నది. కొన్ని శబ్దప్రయోగములు మాత్రము అర్థమెరిగి చేసినట్లు కనబడుటలేదు

'ఘటం భింద్యాత్' విమర్శ రెండవ భాగము హిందీ ప్రచార పత్రిక (స్రవంతి) లో ప్రకటింపబడినది. ఘటభేదనమునకు పటచ్ఛేదనము తోడై నది మూడవసారి మూడవ లక్షణము పూర్తికాగలదు.

విమర్శకుని విజ్ఞానమునకు కొన్ని మచ్చుతునకలు. '*నవ్యతవిద్రూపము. మానవుని ఉష స్సంధ్యాంతముల అలమికొనిన తమశ్ఛటలలో మెలియు చున్నదే చిత్తు.*'

'పాత్రల కార్యవిధానము యొక్క అనుత్ప్రేక్షత వలన కలుగు ఔత్సుక్యమునే కాక పాత్రల నిర్మాణ విషయకమైన అనుత్ప్రేక్ష్యతవలనకలుగు ఔత్కంఠ్యమును కూడ పాశ్చాత్య పాఠకుడు పొందును.' ఈ వాక్యము లే భావమున కనువాదములు?

మరి యీయనకు ఒక్కొక్క శబ్దముచూచి అసందర్భములైన అనేకార్థములు స్ఫురించును. ఇది 'మోదకైస్తాడయ' జ్ఞానము.

ఇవంతయు సరేకాని, హిందీప్రచారకులు తెలుగు కవులకు వ్యతిరేకముగా ప్రచారము చేయుట బాగుగానే యున్నదిగాని, జన్మసిద్ధాంతాది హిందూ మత సిద్ధాంతములకు వ్యతిరేకముగా ప్రచారము చేయుట విషయమును చాలదూరము కొంపోవు చున్నది. రామాయణ కల్పవృక్షమును విమర్శించు మిషతో నాస్తిక సిద్ధాంతములు ప్రచారము చేయబడుట లేదుకదా? *"ఈ జన్మసిద్ధాంతము శిథిల ప్రాయమై తన పాత్రను చాలించినది." "హిందూ మతము తిరునాళ్లవంటిది."* —ఇవికూడ హిందీ ప్రచారములోని భాగమేనా?

మూడవ వ్యాసములో ఈ విమర్శకులు విశ్వనాథవారి భాషనుగురించి వ్రాయుదురట. మంచిదే కాని పాపము ఈయన 'పునరుద్భవత్' అన్న శబ్దమున కర్థము కూర్చుకోలేదు. 'ప్రాధాన్యత' యనుట తప్పని ఈయనకు తెలియదు. 'జంతు బలులూ మొదలైన విషయములకు *ప్రాధాన్యత* నిచ్చిన...' ఇంతవరకు గాలిలో నడచినాడు కనుక సరిపోయినది. ఇప్పుడు నేలమీద నడచునట. అడుగడుగునకు బోర్లపడుట చూచువారికి వినోదముగానే యుండును.

*ఆకాశవాణి :*

గత సెప్టెంబర్ సంచికలో 'ఈ రేడియో అధికారులకు నాటిక, సంగీత నాటిక, రూపకం, వాక్చిత్రం ఇత్యాదులనుగూర్చి సరిగా తెలియనట్టు అనిపిస్తుంది' అని వ్రాశాను. అనిపించడంగాదు; నిజంగానే తెలియదని 26-8-59న శ్రీ శ్రీరంగం నారాయణబాబు రచన(?)'క్షేత్రయ్య'ను ప్రసారం చేసి ఆకాశవాణి మద్రాసు కేంద్రం నిరూపించుకుంది. దీనిని సంగీత రూపకమని ప్రకటించారు. సంగీతరూపకం కాదుగదా, అసలు రూపకమే కాదిది. క్షేత్రయ్యనుగూర్చి మొదట కొంత పరిచయం, తరువాత కొన్ని ఆయనపదాలు, తద్భావ వివరణ రూపావతారికలతోపాటు ప్రసారం చేయబడ్డాయి. అంతేకాని క్షేత్రయ్యకథ కానీ, మరే క్షేత్రయ్యస్పృష్టపాత్ర కథకానీ ఇందులోలేదు. దీన్ని ఏ సంగీత కార్యక్రమంలోనో చేర్చేబదులు బుధవారపు నాటికా కాలాన్ని వ్యర్థంచేసారు. క్షేత్రయ్యకథ ఆధారంగా రచించిన శ్రీ వేటూరి ఆనందమూర్తియొక్క 'వరదయ్య' అనే 'అంద

మైన' సంగీత రూపకం ఆరాత్రే విజయవాడ కేంద్రం ప్రసారంచేసింది. ఒకేనాఉ రెండు ఆకాశ వాణి కేంద్రాలు పరస్పర విరుద్ధంగా ఒకేపదాన్ని వినియోగించాయి. యీవిధంగా అసలు రూపక స్వరూపమే తెలియని మహానుభావులు ఆకాశవాణి కేంద్రాన్ని పరిపాలిస్తున్నారు. అది ఆంధ్రుల దుర దృష్టంకాక మరేమిటి ?

ఇదేవిధంగా నాటికాత్వం తగ్గిన నాటిక శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిది 'శరద్వేణువు' అదేకేంద్రం కృష్ణజయంతిని పురస్కరించుకొని 24-8-59 న ప్రసారంచేసింది. సినీమాలను గూర్చినవిధంగా ఈ నాటికకు 'నటీనట ప్రశస్తి' సంపాదితమైంది. సీతా అనసూయల సంగీతం దీని ప్రత్యేకత. సంగీతానికి అనుగుణంగాఉన్న గీతరచనతప్ప ఇందులో ఇంకేమీ లేదు. అంటే దీనిలో నాటికాత్వంకన్న సాంగీతి కత్వం ఘనంగా ఉంది. ఉత్తి పాటలుగా ప్రసారం చేస్తే అందంగా ఉండేది. 'వాడేనమ్మా మీవాడు' అనే పాట వాద్యసంగీతంతో బలాత్కారంగా ఆక్రమింపబడి పాటతనాన్ని కూడా కోల్పోయింది. 'నాటిక' పేరు 'శరద్వేణువు'. వేణుధ్వని నాటిక మొదలయ్యాక 45 నిమిషాలకు గాని-మొత్తానికి ఒకసారైనా-వినబడదు. ఈ నాటికలో ప్రతిపాదితమైన క్రొత్త విషయం— దైవజ్ఞులు కృష్ణ యోగమాయల మార్పిడి ముందే నందునికి చెప్పడం. పౌరాణికులు, హరికథకులూ మధ్యలో ఉపయోగించుకో వీలైనదిది. వారికి మంచి అవకాశం.

ఇల్లాగే 9-9-59 న శూద్రకుని మృచ్ఛకటిక ఆధారంగా శ్రీ ఊటుకూరి సత్యనారాయణ రచించిన 'వసంతసేన' అనే నాటికను విజయవాడ కేంద్రం మాత్రమే ప్రసారం చేసింది. కథాసంవిధానం దెబ్బతిన్నది. ముఖ్యంగా బంధింపబడిన ఆర్యకుడు తప్పించుకుపోయే సందర్భంలో. సంభాషణలకు గ్రాంథికం, పాటలకు పద్యాలకు వ్యావహారికం ఉపయోగించారు రచయిత. మరి ఇదేం కొత్త 'ప్రయోగమో' ?

30-8-59 న నగరవాణి కార్యక్రమంలో హైద్రాబాదు 'ఏ' కేంద్రం శ్రీ సి. నారాయణ రెడ్డి యొక్క 'కర్పూర వసంతరాయలు' అనే (ఆయనే వ్రాసిన అదే పేరుగల గేయకావ్యం ఆధారంగా వ్రాయబడిన) సంగీతనాటిక ప్రసారించింది. నాటికలో ప్రభువు, లకుమల తీర్థయాత్ర లేక పోవడంవల్ల కథా వికాసం దెబ్బతిన్నది...ప్రభువు సభలో ఉన్నప్పుడు లకుమనుండి 'కమ్మ' వస్తుంది. (అది చదువుకొని) ఆయన 'లకుమా' అని గావుకేక పెడతాడు. (ఆత్రపడతాడేమో కూడా.) 'కమ్మ' లో విషయం ప్రభువుకన్న పేరేవారికి తెలిసినట్లు ఏ ఆధారమూ లేదు. కాని సభ్యులంతా లకుమ కాలు బెణికిందని గుజగుజలు పోతారు. ఇది అసంబద్ధ రచన. దీన్ని రచయితా, ప్రచారకులూన్నూ గమనించకపోవడం శ్రోతల దురదృష్టం. 'రాణి భూదేవి. ఆమెపై అనురాగం కాదు కాని ఆదరం ఉంది. దేశం ఏమైనాసరే! లకుమా సాన్నిధ్యం వదలను.' అనే ప్రభువాక్యార్థం అయోమయం. రాణిని భూదేవి అనే ప్రత్యేకంగా చెప్పడంలో రచయిత ఉద్దేశ్యం అర్థంకాదు ... 'నీ హృదయం ఎత్తైనది' లకుమనుగూర్చి రాణివాక్యం. ఇది తెలుగుకు నప్పదు. 'ఉన్నతం' అన్న పదానికున్న అర్థస్ఫూర్తి 'ఎత్తు' కు లేదు. రచయిత ఎందుకు - ముందైనా - శ్రద్ధ - తన రచనవిషయంలో-వహించకూడదు ? ...అదే కార్యక్రమంలో 22-8-59 న 'అలవాటులేని ఔపోసనం' శీర్షికగా శ్రీ మునిమాణిక్యం, శ్రీమతి వి. రతన్ ప్రసాద్, శ్రీ న్యాయపతి రాఘవరావు లఘురూపంలో మాట్లాడారు. అయితే శ్రీమతి ప్రసాద్ హిందీలోని శ్రీ సుదర్శన్ యొక్క 'సైకిల్ కీ సవారీ' అనే కథకు పేరు చెప్పకుండా ఛాయానువాదం నెరపడం జరిగింది. రచనాచౌర్యాన్ని ఆకాశవాణివారున్నూ అనుమతించడం ఎంత అసహ్యావిషయం!...కథలో

...అన్యభాష మాట్లాడే-అన్యభాషీయ అయిన ఒక మిత్రురాలతో తాను 'ఏక్ క్యాయిష్ హై' అందిట. అప్పుడావిడ-తెలుగురాని ఆ మిత్రురాలు 'ఏమిటి?' అందిట. ఇదేమిరచన! ఎంత అసంబద్ధం! నిర్వాహకులూ ప్రసారకులూ, దీన్ని నిద్రపోతూ అంగీకరించి, ప్రసారించి ఉంటారు.

19-9-59 న మద్రాసునుండి శ్రీ (?) 'శుభ' రచించిన, నిర్వహించిన 'భగ్నహృదయుడు' అనే నాటిక ప్రసారితమయింది. భారత గాథలో అందరిచే చిన్నచూపు చూడబడిన అశ్వత్థామ భగ్న హృదయు డవుతాడు. ఇది భారతం ఆధారంగానే నట...కొంతమంది రావణాదులు రామాదులకన్న ఉత్తములనే 'ఒక సత్యా'న్ని ప్రతిపాదించడానికిగాను పూర్వగాథల్ని నానా హింసించడం జరుగుతున్నది. ఇది ఆ జాతి ప్రకృతికి చెందిన నాటిక. భారతం ఆధారంగా అశ్వత్థామ భగ్నహృదయు డెల్లాగో తెలియదు. అందులో ఆధారాలు లేవు. ఆ పాత్ర ఆద్యంతమూ సక్రమ మార్గంలో, ఒక ప్రత్యేకతతో భారతంలో నిర్వహింపబడింది. ఈ నాటికలో అశ్వత్థామ, తన నితరులు తక్కువగా భావిస్తున్నారనే మిథ్యానుమానం కలవాడుగా చిత్రితుడైనాడు. తనతో బాటు కర్ణుని కూడా నాటికలోకి ఈడ్చుకొని, మరో భగ్న హృదయుడుగా తోడు కుదుర్చుకొన్నాడు పూర్వగాథల ఆంతర్యం తెలియకపోతే ఇల్లాంటి రచనలే చేయవలె ననిపిస్తుందేమో?

అసలు భారతగాథను మద్రాసు గుత్తకొన్నదన్నట్టుగా 'కర్ణుని తల-భారతం' అనే శ్రీ పిలకా గణపతిశాస్త్రి ప్రసంగాన్ని 29-9-59 న ప్రసారం చేసింది. ఆ సామెత ఈ ప్రసంగానికి ఆధారం కావచ్చు. సామెత ఉందిగదా అని దాన్ని సమర్థించడంకోస మన్నట్టుగా ఈ ప్రసంగం సాగింది... భీముని దుశ్శాసనుడు చంపుతాడనే ధైర్యంతో అర్జునున్ని చంపడానిగ్గాను దుర్యోధనుడు కర్ణున్ని వెతుక్కున్నా డనేది విచార్యమైన విచారధార. దుర్యోధనునికి తానే భీముని చంపుతాననే ధైర్యం ఉంది. యుద్ధానికి కొద్దికాలంముందు గదాయుద్ధంలోని మెలకువల కోసం బలరాముని దగ్గర శిష్యరికం అతడు చేయడం దీన్నే సూచిస్తుంది... శ్రీ శాస్త్రివంటివారు కూడా 'అన్యోన్యత' లాంటి పదప్రయోగాలు చేయడం విచార్యం మరి.

25-9-59 న హైదరాబాదునుండి శ్రీ బుర్రా వెంకటసుబ్రహ్మణ్యంగారి 'జేబురుమాలు' అనే నాటిక కాని నాటిక ప్రసారితమయింది. నాల్గు సన్నివేశాల వరుస ఇది. అంతే. నాటికకాదు. మంచి ప్రసారాల్లో ఇదొకటి. రచయిత యొక్క ఈ పేరుగల కథ యిదివరకే బహుళ ప్రశస్తి పొందింది...కొందరు ఒక పని మొదలెడితే పూర్తయ్యేదాకా పట్టుపడుతారు. అయినంతే కానీలే అని సాగినంతకాలం సాగించుకపోయే ప్రకృతి కొందరిది. నాయిక పద్మిని రెండవ జాతికి చెందింది. చిట్టిశాస్త్రిలు లక్ష్మీకాంతం, మధుసూదన్, కృష్ణమూర్తి అనే నాల్గు పాత్రలు నాయికాపాత్ర ప్రస్ఫుటతకు తోడ్పడ్డాయి. జేబురుమాలుమీద నాయికచేసే కుట్టుపని నాయికా హృదయం, ప్రవృత్తికీన్నూ సూచకం.

అదే కేంద్రం 27-9-59 న 'మేఘసందేశం' అనే సంగీతనాటిక ప్రసారంచేసింది. కాళిదాసు మేఘసందేశం దీని కాధారమట. అది ఆధారంఅనకుండా ఉంటేనే బాగుండేది. అని ఆ మహాకవికి అపచారం చేసినట్టయింది, రచన, నిర్వహణ శ్రీ గోపీచంద్. పాటలు, సమర్పణ శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి. సంగీతం శ్రీ పాలగుమ్మి విశ్వనాథం, సహాయకులు శ్రీ వాద్రేవు పురుషోత్తం ఇంతఆర్భాటం,అట్టహాసం కలిగిన ఇది 'అల్లా' తయారయింది...యక్షుడు యక్షిణితో కామక్రియాలోలుడై స్వధర్మ నిర్వహణలో లోపంచేసినందువల్ల కుబేరశాపం—విచారణజరిగే సుమా—శిక్షారూపంలో పొందుతాడు. 'ఆ' విచారణ సందర్భంలో ప్రేక్షకులు 'చివరకే(మై)నా ధర్మమే జయిస్తుంది' అని అను

కొంటారు. దీనిసందర్భం ఏమిటి? యక్షునిస్వధర్మ నిర్వహణలోనిలోపం ధర్మమనా?......యక్షిణి శాపారంభంలో సిగదండతీసి, సిగవేసి, శాపాంతంలో యక్షుడే దాన్ని విప్పాలని అంటుంది.... ద్రౌపదిగాథ నిది సూచిస్తుంది.... కాని దీని ప్రయోజనం?.... దాదాపు ఫాల్గుణంలో శాపారంభం అవుతుంది, 'ఆషాఢస్య ప్రథమదివసే' వైలక్షణ్యం దీనితో పూర్తిగా అణగారిపోయింది... మేఘుడు చివరకు యక్షిణికి సందేశం వినిపించడం, యక్షపతి దగ్గరకెళ్ళి 'వారిశాపాన్ని' నివారించమనడం అకాళిదాసీయమేకాక, కాళిదాస భావానికి వ్యాఘాతమున్నూ, ఆమహాకవి చెప్పదలచుకొన్న 'వారి' విరహౌత్కృట్యం ఈనాటికలోని కల్పనతో పూర్తిగా దెబ్బతిన్నది. 'ధూమజ్యోతి స్సలిల మరుతాం.........కామార్తాహి ప్రకృతి కృపణా శ్చేతనాచేతనేషు'. కాళిదాసు మేఘాన్ని అచేతనంగానే భావించాడు. 'ఉత్తరమేఘం'లోని 'కచ్చిత్ సౌమ్య! వ్యవసితమిదం' అనే ఉపాంత్యం శ్లోకం కూడా యక్షుని విరహౌత్కృట్య సూచకమే. కొన్ని ప్రతుల్లో మేఘోక్తిగా 'ఉత్తరమేఘం' చివర రెండు ప్రక్షిప్తశ్లోకాలున్నవి. అవి కాళిదాసభావానికి అతకనివి కాబట్టే ప్రక్షిప్తాలన్నారు పూర్వులు. 'కాళిదాసుకవిత్వం కొంత......' అనే సామెత ఈనాటికవిషయంలో సార్థకమవుతోంది...... తందానపాట రీతిలో రామకథపాట నాటికా పేలవత్వానికి తోడ్పడుతోంది. సంభాషణలు గ్రాంథిక వ్యవహారికభాషా సమ్మేళనం. ఇది 'సమన్వయవాదం' కాబోలు. ఒకేఒక్క కాళిదాస వందన గీతమే ఇందులో బాగున్నది. ఆకాశవాణి నిర్వాహకులే 'ఇల్లాంటి' తమరచనలను ప్రసారం చేస్తుంటే, వాటిననుసరించే మిగతా 'అల్లాంటి' వాటిని ప్రసారంచేయడంలో ఆశ్చర్యమేముంది? మనం ఎల్లాగూ వింటున్నాంగదా!

29-9-59న విజయవాడనుండి 'తెలుగులో రవీంద్రుని సాహితి'ని గూర్చిన శ్రీ అమరేంద్ర ప్రసంగం సాహిత్యనందిని కార్యక్రమంలో ప్రసారిత మయింది. టాగూర్ చూపిన వెలుగుదారుల్లో తెలుగురచయితలు అందరూ నడుచుకోవాలనడం లాంటి అత్యుక్తులు ఉన్నాయి. ప్రసంగవిషయానికివి సంబంధించినవి కానివి. తెలుగులో అనూదితమైన రవీంద్ర సాహితీవరకే ఇదిపరిమితం. మహాకాదంటే రవీంద్రప్రభావిత రచనలదాకా విస్తరించవచ్చు. అయితే ప్రసంగంలో ముఖ్యంగా పేర్కొ వలసిన ఒకవిషయం ఒదిలి వేయబడింది. అది 'చలం' యొక్క గీతాంజలి అనువాదం. ఈమధ్యనే వెలువడింది. చలం టాగూర్ ప్రభావితుడు. టాగూర్ను గూర్చి చలానికీ శ్రీ శ్రీకి జరిగిన వాదవివాదాలు ఇంకా సాహిత్యకులకు మరుపున బడలేదు. అల్లాంటి ఆయనరచన పేర్కొబడకపోవడం ప్రసంగంలోని ముఖ్యలోపం.

ఆనాడే ఆ కేంద్రమే ప్రసారంచేసిన శ్రీ మంద పాక రాజేశ్వరశాస్త్రి 'బొటనవ్రేళ్లు' అనే నాటిక-సంగీత, నాట్యాలు విషయంగా గలది—సంగీత నాటిక కాలేకపోయింది, సాంగీతిక, అసాంగీతికాలు నిర్వాహకుల చేతిల్లో తమ అదృష్టాన్ని మార్చుకుంటాయంటే ఇదేవిధం కాబోలు,

హైద్రాబాదు కేంద్రం ఇరుగుపొరుగు భాషల్లోంచి నాటికలు అనువాదంచేసి, ప్రసారం చేస్తున్నది. 2-9-59న 'స్త్రీ'మళయాళంనుండి 30-9-59న 'ఎటో ఎగిరిపోయిన గుర్రం' కన్నడం నుండీన్నూ, ఒక నెలలో రెండనువాద నాటికలు. (అఖిలభారత రూపక కార్యక్రమం ఎల్లాగూ తప్పనిసరిగదా.) ఈ రెండూన్నూ అనుత్తమ నాటికలు. మొదటిది అసలు నాటికే కాదు. రెండవదీ అంతే. వీటిని నాటికలనడం నిర్వాహకుల అలవాటు అంతే. కథను కథకుడు చెబుతూ చెబుతూ కథాగత పాత్రలతో మధ్య మధ్య మాట్లాడించినంతమాత్రాన అది నాటిక కావడానికి వీల్లేదు. ఇతర భాషల్లోంచి అనువాదంచేసి తెచ్చుకొనేప్పుడు ఉత్తమనాటికలను తెచ్చుకోవడం అత్యవసరం. కాకపోతే తెలుగు

నాటికా రచయితలకూ, శ్రోతలకున్నూ అపచారం చేయడమే అవుతుంది.

అరువుతెచ్చుకొన్న నాటికల స్థాయికి చెందిందే మద్రాసు నుండి 5-10-59 న శ్రీ నల్ల రామ్మూర్తి (ప్రసిద్ధ 'హాస్య' నటకుడు) తామే రచించి నిర్వహించగా ప్రసారితమైన 'పెళ్లయింది-పిచ్చికుదిరింది' అనే నాటిక. ఆకుకందకుండా, పోకకుపొందకుండా వ్యర్థ సన్నివేశాలతో కూడిన గంటసేపటి నాటిక ఇది. ఆ'రచయితృ' గత గౌరవబుద్ధితో ఇది ప్రసారితమయిందేమో ?... 7-10-59 న హైద్రాబాదునుండి ఓ మోస్తరు నాటిక - అంటే చెడనిది - శ్రీ పోరంకి దక్షిణామూర్తి రచించిన 'యామినీ పూర్ణ తిలక'. దీనిలో ముఖ్యంగా కలిగే సందేహమల్లా, యామినీ పూర్ణ తిలకకు చదువుచెప్పేందుగ్గాను నియుక్తుడైన బిల్హణుడు, ఆ చదువు చెప్పడంకొరకు అనలోరాత్రాలూ ఆ కాండపటం వ్రేలాడవేసిన వాణీ మందిరంలోనే ఉండడం ఎంతవరకు సబబు అనేది.

శ్రీమతి కె సుందరమ్మగారు రచయితయో, రచయిత్రియో తెలియని ప్రకటన కర్త్రికల— నాటిక చివర 'రచయిత' అనే ప్రకటించారు— మద్రాసు కేంద్రం ఆమె యొక్క 'ఇంటర్వ్యూ' ప్రసారంచేసింది.

ఇతర కార్యక్రమాలు కారణంగా చాలావరకు ఎగిరిపోగా మిగిలిన రసమయి కార్యక్రమ సమయంలో 12-10-59న శ్రీ పాటిబండ మాధవ శర్మ 'అలంకారశాస్త్రం—ప్రాచ్య పాశ్చాత్య రీతులు' అనే చక్కని ప్రసంగం వినిపించారు హైద్రాబాదునుండి. ప్రసంగం పూర్తిగా విన్నాక పాశ్చాత్యుల కలంకారశాస్త్రంలేదని, కావ్యశాస్త్రమే ఉందని తెలుస్తుంది. ప్రాసంగికులు అలంకారానికి చెప్పిన రెండర్థాలగా—1 అర్థ శబ్దాలంకారాలు, 2 సౌందర్యము—వారు వివరించిన పాశ్చాత్య 'అలంకార' శాస్త్రపద్ధతి ఒదుగదు. శీర్షిక అసందర్భంలో మార్చవలసి రావచ్చు.

చివరకొకటి చెప్పవలసిఉంది. అది 'తెలుగులో వార్తలు' గురించి ఈవార్తా శ్రావకులు అనూహ్య రీతిలో వార్తాశ్రవణం చేస్తున్నారు. భాషలో ఒకయాస 'ఆకాశవాణియాస'ను సృష్టించే ప్రయత్నం ఘనంగాచేస్తున్నారు. వంటబుట్టని యాస వార్తల్లో రావడంవల్ల తెలుగుభాషకు 'అష్టవంకర్లు' వస్తున్నాయి. ఈయాసను సృష్టించేందుకు చేసే ఘనయత్నంలో బ్రిటన్ బ్రిట్టన్అయి మళ్ళీ బ్రిటన్‌గా సర్దుకోబడుతోంది. భరత, భారతఅనీ, మనూభాయ్‌షా మానూభాయిషా అనీ దేశానికి బాధ్యతగల వ్యక్తికి రెండుసార్లు ఒకపూటలోనే కల్పించబడుతున్నాయి. మరోటి. వాక్యాలను అతి దీర్ఘంగా పెంచి అనన్వయం కల్గిస్తున్నారు...వారెవరో అందరినీ....లిబరల్ పార్టీలో—కలిసి పనిచేయాలని విజ్ఞప్తిచేశారు. అందరితో 'విజ్ఞప్తిచేసారనడానికీ ఘోష...'యునైటెడ్ నేషన్స్' పంపిన పరిశీలకదళం లావోస్‌ను గూర్చిన నివేదిక ఈనెలాఖరులో భద్రతాసమితికి సమర్పించుతారు. అనువాదవిధానం ఇల్లా ఉంది. మొదటిమాటకు 'ఐక్యరాజ్యసమితి' అన్నది ప్రచారంలో ఉన్నదేగదా! దాన్ని ఉపయోగించకుండా, ఒకే వాక్యంలో అనువాదాన్నీ అననువాదాన్నీ కల్పించడమేమిటి? అందరికీ పత్రికలద్వారా పరిచితమైన 'పెకింగ్' 'పీకింగ్' అయింది. ఈవిధంగా తెలుగుభాషను చిత్రవధచేసేయత్నం, అవమానించే వైఖరి వార్తలు చెప్పేవారు ఎంతత్వరగా మానుకుంటే అంతమంచిది. —సామీర

## ప్రతాపరుద్రీయము - పాత్రోచితభాష

శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారి ప్రతాప రుద్రీయనాటక ప్రశస్తికి గొందఱకు పాత్రోచిత భాష హేతుభూతమని చెప్పుదురు. పాత్రోచితభాష లక్షణ సమ్మతమా ? పాత్రోచితభాష యుపాదే యమా ? ప్రతాపరుద్రీయము నందలి పాత్రోచిత భాషా స్వరూప మెట్టిది ? అనునవి పర్యాలోచింప వలసిన విషయములు.

పాత్రోచిత భాషను నాటకములలో నేల వాడ వలెను? నాటకము లోకానుకరణము కావున పాత్రోచిత భాష వాడిననే యందలి సంభాషణలు సహజములనిపించును. సంస్కృత నాటకములలో నీచపాత్రలకు ప్రాకృత భాషా భేదములు వాడబడ లేదా ? యాంధ్రమున గ్రామ్యము వాడవచ్చును. గీర్వాణ రూపకములలోని సంస్కృతము స్థానమున నాంధ్రరూపకములందు గ్రాంథికము ప్రయోగింప దగును. ఈ యభిప్రాయముల మీదనే ప్రతాప రుద్రీయ నాటకము కూడ నిర్మితమైనట్లు చెప్ప వచ్చును.

ఈ సమాధానము స్థూలదృష్టికి సత్యముగా భాసించును. కాని సూక్ష్మముగా విచారణచేసితిమేని యిది కేవల భ్రాంతిమూలకమని స్పష్టపడును. నాటకము లోకానుకరణము కావున పాత్రోచిత భాషయే సహజమనుకొనుట పొరపాటు. నాటకము లోకమునకు సర్వథా ప్రతిబింబముకాదు. ప్రతి బింబమే యైనచో నది కావ్యముకాదు. కావ్య మనగానే యందలౌకికత్వము తప్పక యుండును. ఉన్ననే దృశ్యకావ్యమను వ్యవహారము సరిపడును కావున పాత్రోచిత భాషయే సహజమనుకొనుట పొసగదు. గ్రాంథిక భాషలో వ్రాయబడిన నాట కము లస్వాభావికములుగా ననిపింపకుండుట యనుభవ సిద్ధమైన విషయము. గ్రాంథికములో వ్రాయబడిన నాటకములు ప్రజాదరణము చూఱ గొనుట సర్వ విదితము. పాత్రోచిత భాష యే నాటకములందు సహజమన్నచో ప్రతాప రుద్రీయ మున పద్యములు ప్రయుక్తములైనవి కదా! అవి సహజము లెట్లగును? అవియును సామాన్యమైనవా? ఎదుట పాత్రకు గూడ నర్థమైన స్థితిలో లేని యస్థాన గతములు.

ముందు ఫిరోజు ముస్తఫ సముత్థకుచాకృతి
మ్రొగ్గజేయగా
మందత వెన్క శ్రోణియుపమన్ దుముదా
ర్దొర వీపు నిల్పగాన్
అందువు గల్లుగల్లురన నట్టిటు తొట్రిలు
కామపీడితన్
మంద విచార నంధ్ర పృతనాపతి కౌగిటిలో
గరంచుబో

ఈ పద్యము చెకుముకిశాస్త్రి ఖుస్రూఖానుతో బల్కినది. గూఢోపదేశములుగా నున్న పాటలు మున్నగునవి ప్రజాసామాన్యమునకు దుర్గ్రాహ్యా ములని యంగీకరింపకతప్పదు. పాత్రోచితభాషయే స్వాభావికమనుకొను విచారపరుల కిట్టివి యసహజ ములుగా దోపకుండుట వింత. సంస్కృతనాటకము లలో పద్యములుండుటచే వారికి విచారణయే తల నూపలేదు. ఇట్లనుటచే నాటకములలో పద్యము లెంతమాత్రము నుండరాదని నా తలంపుకాదు. నాటకము కూడ నలౌకికమే యగుటచే దత్తదుచిత రీతిని పద్యము లుండుట సంభావ్యమే. ప్రశ్న యే మనగా పాత్రోచితభాషయే సహజమనుకొనువారు పద్యములుండుట యసహజమని యేల తలంపలేదని, నిత్య వ్యవహారములో నెవ్వరును పద్యములతో బ్రసంగించుచుండ లేదు గదా!

సంస్కృత నాటకములలో ప్రాకృత భాషాభేద ములు వాడబడినను వానికిని గ్రామ్యభాషకును భేదముగలదు. ప్రాకృతము వ్యాకరణ సంస్కారము కలది. కావున నపభ్రంశమనిపించుకొనదు. మన గ్రామ్య మట్టిదకాదు దీనికి వ్యాకరణసంస్కారము లేదు. నియమాభావమువలన నిది యపభ్రంశమగు చున్నది. (అనియమాద్గ్రామ్యంహియత్త్వపభ్రంశః;

నియభావతస్తుతత్ — నన్నయాథర్వణులు) కావున ప్రయోగార్హత గ్రామ్యమునకు లేదు. (సంస్కృత నాటకము లందలి ప్రాకృతములకు ఛాయలు వ్రాయవలసి వచ్చుట యెల్లరెఱిగినదే.) ప్రాకృతముతో సామ్యము తెచ్చి గ్రామ్యము ప్రయోగ యోగ్యమనుకొనుట పరిశీలన రాహిత్యకృతము.

సంస్కృతము స్థానమున నాంధ్రనాటకములలో గ్రామ్యము వాడుట పాత్రోచిత భాషాసిద్ధాంతమునకే మూలచ్ఛేదము చేయుట. అర్ధానుస్వార శకటరేఫములు, నుగాగమగజడదబాదేశములు మున్నగు నియమములతో బంధితులు నైతము ప్రసంగించుచుండలేదుగదా! ఇట్టి నియమముల తోడి భాష పాత్రోచితమగుట యసంభవమనక తీరదుగదా! ఈ పక్షమున శిష్టవ్యావహారికమే ప్రయోజ్యమనవచ్చును. శిష్టవ్యావహారిక మపశబ్ద ప్రచురమై యున్నదనుట విస్మరింపరాదు.

ప్రతాపరుద్రీయమునఁ గొన్ని పాత్రలకు గ్రాంథికము వాడుట యీ విధముగా బాత్రోచిత భాషా సిద్ధాంతమునకే విరుద్ధము. అర్ధానుస్వారాద పూర్వోక్త నియమము లీ గ్రాంథికభాషలో బాటింపబడెను. వాక్యమధ్యమున విసంధులు ధారాళముగా జేయబడినవి. పెక్కుచోట్ల యడాగమములు వ్రాయబడలేదు. ఇవి సలక్షణతాభంజకములని శ్రీ శాస్త్రిగారు గ్రహింపకపోవుట చింత్యము. 'సంహితైకపదేనిత్యా' ఇత్యాది కారిక సంస్కృత భాషామాత్రవిషయకమని గ్రహింపక తెలుగున వాక్యసంధి యైచ్ఛిక మనియు "యశ్రుతిమార్యా" ఇత్యాది చింతామణి కారికనుబట్టి యడాగమములు వ్రాయనక్కఱ లేదనియు శ్రీ శాస్త్రిగారు రెండు సిద్ధాంతములు విసంధి వివేకమను గ్రంథమున బ్రతిపాదించిరి. ఆ యప సిద్ధాంతములే ప్రతాపరుద్రీయ గ్రాంథికము నందును ననుసరించిరి. సలక్షణతా భ్రాంతిని జేయబడిన 'యావత్తు'(70 పు.) 'కొదువ' (115, 120) 'సాక్షాత్తు' (188 పు) వర్తమాన కాలమున - 'ఉంటిని' (1 పుట.) మున్నగు నపశబ్దములవలె నివియు నగ్రాహ్యములే యనదగును. నుగాగమములు గజడదబాదేశములు పెక్కుచోట్ల బాటింపబడియు గొన్నిచోట్ల నుపేక్షితములగుట సరికాదు. "జమీనును కాపాడుటకై" (71 పు.) 'గతమునకు చింతిల్లకు' (180 పు) 'చాకళ్ళలో చెడలేదు' (226 పు) మున్నగునవి. 'పల యతి విస్తరము' (1 పు.) అను రీతిని యడాగమములు వ్రాయుటయు లేకపోలేదు. 'తమ్ముడు తమ్ముడూ' సంబోధనలు !! (68, 69 పు.)

ఈ విధముగా నీ నాటకమునందలి భాష గ్రాంథికమా ? కాదు. పాత్రోచితను కానేరదు. వ్యావహారికమో గ్రామ్యమో యనుటకును వీలు లేదు గ్రాంథికమనగా సలక్షణమనుటకు విసంధులు యడాగమరహిత లేఖనములు నుగాగమ గజడదబాదేశాభావములు ప్రతిబంధకములు అర్ధానుస్వార శకట రేఫములు నుగాగమ గజడదబాదేశములు పాటింపబడుటచే బాత్రోచితము కాదు. వ్యావహారికమో గ్రామ్యమో యనుటకును నివి యడ్డంకులే. విసంధులు పాటించుట వ్యవహార సిద్ధమునుగాదు.

గ్రామ్యమున సంభాషించు నీచపాత్రలభాషలో 'మఱి' (35, 112 పు.) మొఱ్ఱో (112 పు.)అను రీతిని శకటరేఫములు వాడబడినవి. 'మామా' అని యనునాసికోచ్చారణ విరహితముగా వ్రాయబడెను. (50, 51, 204 పు.) తదుచ్చారణ చిహ్నము లేమింజేసి వ్రాయబడలేదనుటకు వీలు లేదు. 'మావసం' (103 పు.) 'రోయి' (105పు.) అనుచోట్ల వా రనునాసికానుమాపక చిహ్నముల నుంచియే యున్నారు, 'నా రా య ణా' 'నారాయణ మూర్తి' (51, 91 పు) అనుచోట్ల 'ణ'త్వములే వ్రాయబడెను. "తమవంటి మహా ప్రభువులు మంత్రులమాట దాటరాదు" (96 పు.) అని జవానుచే ననిపించిరి. 'దాటు' లో నరసున్న పెట్టకపోవుటచే నిది తత్పాత్రోచితమని తలంచి యుందురు. కాని గ్రాంథికమున మాటాడువా

రైనను నిందలి యర్ధానుస్వారము నుచ్చరింతురా? తురక లూనికతో గ్రామ్యము మాటాడిరి. కొన్ని చోట్ల నూనిక పాటింపబడలేదు. "ఓరంగల్ మహా రాజావారికి మనమీద చాలా దయ వుంటుంది" (8 పు.) "ఎంతలో వచ్చినామో అంతలో వెల్ల లేమా" (9 పు.) మొదలైనవి 'వారుగో' అనునది కొన్నిసార్లు ప్రయుక్తమయ్యెను. ఈ విషయము లను బట్టి యిందలి గ్రామ్యముకూడ నియమిత ముగా లేదని చెప్పవలసి వచ్చుచున్నది.

ఈ నాటకమున నన్యభాషాపదములు ధారా ళముగా వాడబడినవి. మహాలు, కిఫాయిత్, కంచెణా, నజర్, హర్షత్, కేవు. దుబాసి, తవేలా, హవేలీ, యఖ్తార్, ఖాసా, ఘర్, సబురు, ఖాత్, పురుసత్తు, లష్కరు, క్యాకర్నా భాయ్ మున్నగు నవి. ఆంగ్ల భాషా పదాదులవలన గన్యాశుల్కము ప్రజా సామాన్యమునకు దుర్గ్రాహ్యమన్నచో నిందలి యీ తురుష్క భాషాపదములవల్ల గూడ గొంత దుర్గ్రాహ్యత వాటిల్లు ననవచ్చును. ఈ యన్యదేశ్య పదములు తత్తత్పాత్రోచితములుగా బొందుపడి యున్నవని మాత్రము చెప్పనగును. "అహేయ మన్యదేశీయం యత్తదేవ ప్రయుజ్యతే" అను నథర్వణ కారికచే నన్యదేశ్యములు ప్రయో గించుటకు లాక్షణిక సమ్మతి కలదని చెప్పదగును. ఆవశ్యకమైనను గాకపోయినను నన్యదేశ్యములు విచ్చలవిడిగా ప్రయోగించుటకు మాత్రమీ యథర్వణకారిక, చేయూత నీయదని గ్రహింప నగును. "అహేయమ్=ఆంధ్ర పర్యాయ శబ్దా భావమున విడువరానిది."

పాత్రోచితభాష గ్రాహ్యమను తలంపుతో నపశబ్ద భూయిష్ఠములుగా నాటకములు రచితము లగుట శాస్త్ర సంప్రదాయ విరుద్ధము. పాత్రోచిత భాషయే సహజమనుకొనుట కేవల భ్రమ ప్రమాద మూలకము, అవిచారిత రమణీయము.—*గాండీవి.*

జయంతిలో సాహిత్యధార. చర్చావేదిక ముఖ్య మైన శీర్షికలు. విశ్వనాథనారి "అభిజ్ఞానం !" అభిజ్ఞు లకు ఆనందహేతువు, కాగా అది రసవిషయైక నిష్ఠానందం కనక ఆలోచనామృతం.

చర్చావేదిక, సాహిత్యధార—ఈ రెండూ సువ్యవస్థమీద నడిస్తే మనస్సు వికసిస్తుంది. పశు వాతాలూ, ఆవేశాలూ మానవుడికి నిసర్గభూషణా లయిపోయిన రోజులలో ఆ అలంకారాలు విసర్జించ డానికి పురుషప్రాణి అంగీకరించలేదు కదా. ప్రయ త్నించి ఈ రెండు నగలనూ విడవగలిగితే మంచిదే.

ఆదిలో సాహిత్యధార కొంత బరువుగా నే ఉండేది. బహుశః 'సమవర్తి' ఈ ధారను నిర్వ హించడం విధిగా భావించడంవల్ల - యథాశక్తి ప్రతిమ పూజలా - అక్కడక్కడ మరీ నీరసంగా ఉంటోంది. కొన్ని కథలలో వాడబడే ఇంగ్లీషు పదాలమీద కొంత విసిరారు. అది అనవసరమనను. ఆ మందలింపు పత్రికా ముఖంగా, ముఖ్యంగా జయంతిలో రావలసింది కాదు, తెలుగు భాష, తెలుగు నుడికారం, తెలుగు జాతీయం తెలియని వాళ్ళు సంపాదకులై కూర్చుంటూన్నప్పుడు వారి కంటె ఉన్నతుల కథల, వ్యాసాల, కృతుల ప్రచురణ సామర్థ్యం వారి కెలా వస్తుంది. అందు చేత సంపాదకుని స్థాయికితగ్గ రచయిత అంతకంటె వ్రాయలేడని సమవర్తి గ్రహించలేరా. సంపాద కుల సాహిత్య జ్ఞానపరిధి ఎవరుగనిది వారి భాషా జ్ఞాన వైభవం 'జయంతి' (11) చర్చావేదికలో కౌశిక చూపించారు. ఆయన పెట్టిన 'చ' కార గుడీలు ఎంత రుచిగా ఉన్నాయి సంపాదకులకు. 'అందుచేత' 'సమవర్తి' మరికొంత శ్రద్ధాబాధ్యత లను వహించాలని ఆశ.

—శివశ్రీ

# ఒక సంవత్సరపు జయంతి

జయంతి మొదటి సంచికలోని సంపాదకీయంలో "మాకు మనదేశము, మనభాష మన సారస్వతము పరమప్రియములు...మా యూహా సారస్వతము నందొక వ్యవస్థ కల్పించుటకు ప్రయత్నము చేయుద మనియె." అని సంపాదకులన్నారు.

ఆ వ్యవస్థ ఏమిటి ?

ప్రస్తుతం సాహిత్యంలోని వివిధ రంగాల్లో ఒక అనూహ్యమైన అవ్యవస్థ ఏర్పడి వుంది. అది పోయి సరియైన మార్గాలు ఏర్పడడమే వ్యవస్థ. జయంతి సంపాదకీయాలు ఈ విషయాన్ని ఆపాతతః ప్రస్ఫుటం చేస్తున్నాయి.

ఈ మధ్య వస్తున్న విమర్శలు కొన్ని ఆంగ్ల విమర్శనాదృష్టితో భారతీయ రచనలను విమర్శించు తున్నవి. అవి ఈ రచనలలోని రసాది ముఖ్య విషయాలకు అనుగుణంగా ఉండటంలేదు. అలాకాక మన సంప్రదాయాన్ననుసరించి—ఆంగ్ల సాంకేతిక పదపుత్రికలను తెలుగులో సృష్టించకుండా— భారతీయ సాహిత్యంలో ప్రాధాన్యం వహించే రస, ధ్వని ఔచిత్యాలను చూపేవిగా ఉండాలి. అలాంటి విమర్శను ఉద్యమంగా సాగించడానికి 'జయంతి' కృషి చేస్తున్నట్లుగా కనబడుతున్నది. అది వాంఛనీయం.

విమర్శ ఎట్లా ఉండాలన్నదానికి లక్ష్యమా అన్నట్లు జయంతి వరుసగా పన్నెండు సంచికలలో శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి 'అభిజ్ఞాన శాకుంతలము' అన్న వ్యాస పరంపరను పాఠకుల కందించింది. శాకుంతలంపైన ఈనాటివరకు కాళి దాసు ఆత్మను పట్టి ఇచ్చే ఇట్లాంటి విమర్శ ఎక్కడా రాలేదనేది నిర్వివాదం. భవభూతి మొదలగు మహా కవుల గ్రంథాలనుగూర్చి కూడ జయంతి ఇట్లాంటి వ్యాసాలనే ఇకముందు కూడ అందిస్తుందనే ఆశిస్తున్నాను.

శ్రీ వేటూరి ఆనందమూర్తిగారి 'ఆముక్త మాల్యద' అన్న వ్యాసం చాల విషయాలను పాఠ కున కందిస్తుంది. ఆ గ్రంథాన్ని రస-మత దృష్టు లతో వ్యాసరచయిత చూసారుగాని పాఠకుడికి మాత్రం ఆ విషయం కొంత గజిబిజినే కల్పించింది.

పత్రిక గుణాలలో ఒకటి పాఠకుల మనస్సుల్లో సంచలనం కలిగించి ఆలోచనను రేకెత్తింప జేయడం. ఈ పని శ్రీ కేతవరపు రామకోటి శాస్త్రిగారి 'విమర్శ-విమర్శకుడు' (4, 5 సం.), వ్యవహార భాషపై శ్రీ జువ్వాడి గౌతమరావు గారి వ్యాసం (7 సం.) చేసినవి. ప్రతి విషయంలో విభిన్న వ్యక్తులకు విభిన్న అభిప్రాయా లుండవచ్చు- అభిరుచీ ఉండవచ్చు. అందువల్ల వాదోపవాదాలు చెలరేగుతాయి. వీటిలోనే అసలు విషయం నిగ్గు తేలే వీలున్నది. అయితే వీటిని ఆపకుండా సాగిం చడం లాభకరం. మర్యాదాతిక్రమణ జరగనంత వరకు. ఆలోచన పెంపొందడానికి ఉపయోగపడ వలసిన ఇవి వ్యక్తిగతంగా మారడం విచార్యం. చర్చావేదికలో ఈ మారడం కొంత కనిపిస్తోంది. ఉదాహరణకి శ్రీ రాంషాగారికి శ్రీ రామకోటి శాస్త్రిగారి సమాధానం (6 సం.) ; శ్రీ విశ్వనాథ రావుగారి 'రాజశిల్పి' విమర్శకు శ్రీ అరిపిరాల విశ్వంగారి సమాధానం (6 సం.)—. ఇట్లాంటి విషయాలలో విమర్శకు, ప్రతివిమర్శకులు సహృద యత చూపడం చాల అవసరం. సమాధాన మిచ్చినా, పుచ్చుకొన్నా నొచ్చుకోని విధంగా ఉండాలి. ఉదాహరణకి శ్రీ సంపత్కుమారకు- శ్రీ మోటూరి వెంకటరామగారు ఇచ్చిన సమా ధానం (8 సం.). సంపాదకులు కూడ యీ విష యంలో, వ్యాసాల్లో సౌమ్యత వచ్చేవిధంగా ప్రయత్నం చేసే బాధ్యత కల్గివున్నారు. అయినా వారి నిష్పక్షపాతవైఖరి అభినందనీయము.

రూపక సాహిత్యంమీద రెండు వ్యాసాలు వచ్చాయి. శ్రీనివాసరావుగారి అభ్యుదయ నాటికలు (6 సం.) శ్రీ సుప్రసన్నగారి 'సంస్కృత రూపక ములఅనువాదములు. (10, 11, 12 సం) వీటిలో మొదటిది ఎత్తుగడలో బాగుండి పోనుపోనూ పేల వంగా కనబడింది. రెండవది బహుపరిశ్రమను,

సంపూర్ణ విషయాన్ని (నిజానికి ఎంత చెప్పినా ఇల్లాంటి విషయాలు సంపూర్ణం కాదేమో) అంది స్తోంది. చివరకు అనువాద నాటకముల పట్టిక ఇవ్వడంవల్ల పాఠకులకు అనువాద నాటకాలను గూర్చిన వివరణ లభించింది.

పదవ పంచికనుండి ప్రారంభమైన శ్రీ సమ వర్తిగారి 'సాహిత్యధార' తెలుగు సాహిత్యపత్రికా లోకంలో ఒక క్రొత్త సమీక్షాప్రక్రియ. జయంతికి చాల వన్నెతెచ్చిందిన్నీ, ఈసమీక్షాప్రక్రియ ఇతర పత్రికలకు రచయితలకు హెచ్చరికగా ఉంటోంది. కాని "తమ వ్యాసకర్తలు ఎచ్చటను మర్యాదాతి క్రమణ దోషమునకు గురికాకుండ జూచు బాధ్యత సంపాదకులపై నున్నది" (సా. ధా. 8) అన్న సమవర్తిగారే స్వయంగా అక్కడక్కడ తమ ప్రతి పాదనను అతిక్రమిస్తున్నట్లుగా తోస్తుంది. ఈ అతి క్రమణ దావాపు వెక్కిరింపు రూపంలో కప్పుకు పోతుంది. (11 సం. 8 పు. 2 పే.) వారు 'ఘాటు' కొంత తగ్గించవలసిన అవసరం బాగా కనిపిస్తుంది.

పదవ సంచికనుండి ఆరంభమైన 'ఆకాశవాణి, ద్వారా వచ్చే రచనలనుగూర్చి నిర్దుష్టంగా నిష్పాక్షి కంగా శ్రీ సామీరిచేస్తున్న విమర్శ ఆకాశవాణి నిర్వాహకులకు తప్పకుండా కనువిప్పు కల్గిస్తుందని ఆశించవచ్చు. అయితే శ్రీ సామీరి కొన్ని మంచి రచనలుకూడ ఉపేక్షించడం జరుగుతోంది. ఉదాహ రణకి ఈమధ్య జరిగిన ఆకాశవాణి నాటకసప్తాహ కార్యక్రమాన్నిగూర్చి వ్రాసే సందర్భంలో ప్రాచీ నాధునిక రచనా సమ్మేళనంతో చాల అందమైన శ్రీ కాటూరివారి శ్రీనివాసకళ్యాణంఅనే యక్ష గానం విస్మరింపబడింది. మరొక్కటి, ఒకేరచనను గూర్చి పేజీలు వ్రాయడంకంటే ఎక్కువ రచన లనుగూర్చి శ్రీ సామీరి చెప్పడం అవసరమనిపిస్తుంది లాభకారికూడ ఇది.

కవితలు ప్రచురించడంలో చూపించే శ్రద్ధా సక్తులు కథనాటికలపై సంపాదకులు చూపడం లేదు. ప్రకటించబడ్డ ప్రతికవిత చాల బావుందని కాదు. అప్పుడప్పుడు చప్పగా చప్పరించబడే కవితలు కూడ వస్తూవున్నాయి. కాని పూర్తి అశ్రద్ధ చూపేది కథ నాటికల మీదనే—సాధార ణంగా మౌలిక కథలు రెండు, ఒక అనువాద కథ వేస్తున్నారు. ఒక్కొక్కప్పుడు అనువాద కథలు పెద్దవయి పదిహేను పేజీలదాకా మ్రింగివేస్తున్నాయి. (బాలచంద్రుడు 8.) అంత పెద్ద అనువాదాలు చేయడంకన్నా చిన్నవాటిని ఎన్నుకొని మౌలిక కథలకు స్థానమివ్వడం మంచిది. శ్రీ నాగభూషణ్, శ్రీ మురయాగార్ల అనువా దాలు బాగున్నాయి. గౌతమరావుగారి బాల చంద్రుడు చివర చివర్లో అనువాదంలో అందం పోగొట్టుకొంది.

మౌలికమైన కొన్ని వర్తమాన రచయితల మంచి కథలు జయంతి అందించింది. శ్రీ బో. సూర్యా రావు (సం. 3), మురయా (సం 6), చ రంగ స్వామి (10) మ. రాజారాం (10) మంజుశ్రీ (8, 11) పి శ్రీదేవి (9) గార్లవి బాగున్నాయి. హాస్యకథల్లో రెండే రెండు— ఒకటి శ్రీ మాచి రాజు దేవీప్రసాద్ గారిది (7), రెండు శ్రీ పుచ్ఛా పూర్ణానందంగారిది. రెండవది వంటలక్క ఇంటర్ వ్యూలో పాకంముదిరి కొంచెం వెగటు కల్గించినా బాగుంది.

బుచ్చిబాబుగారి కథలు బాగున్నా వారి కథలు కాబట్టి చదవాలనేమో అనిపించేవి జయంతి అందిం చింది. 'కొన్నిసామెతలగన్న కథలు' - శ్రీ శండిల గారివి బాలసాహిత్యపు స్థాయిని మించిలేవు.

సంఘటన ప్రాధాన్యంగల కథలు మాత్రం బొత్తిగా లేకపోవడం కొంచెం లోపంగా కనబడు తుంది. కథాసాహిత్యంలో క్రొత్త రచయితలను మరింతగా ప్రోత్సహించడం అవసరం.

సంపాదకీయాలు ఎట్టి అవసరాలలో వ్రాస్తు న్నారో తెలీకుండావుంది. అప్పుడప్పుడివి కనబడవు. పత్రికకు దీన్నిగూర్చి ఏదో ఒక నియమం ఉండాలి. ప్రతిమాసం ఏదో ఒక విషయంపై వ్రాయడమో

లేక వత్సరాని కొకసారి వ్రాయడమో జరగాలి. కాని జయంతి పాఠకులు మాత్రం సంపాదకీయం ప్రతినెలా ఉండాలనే ఆశిస్తున్నారు. ఇకపై సంపాదకులు దీన్ని గమనించాలి.

ఈ కొన్ని లోపాలు సంపాదకుల శ్రద్ధవల్ల సర్దుకొనేవే, అయినా శ్రీ విశ్వనాథవారి - శాకుంతలమువంటి వ్యాసపరంపర; శ్రీ సుప్రసన్న, వేటూరివంటివారి విమర్శలు, శ్రీ నాయని, సంపత్కుమార ఇతర కవుల కొన్ని ఉత్తమకవితలు; సాహిత్యధార, ఆకాశవాణివంటి సమీక్షలు; వివిధ భావప్రకటనకు రంగస్థలమైన చర్చావేదిక మొదలైనవి అందిస్తున్నందుకు జయంతి సంపాదకులు అభినందనీయులు.

జయంతి ముందుముందు తన ఉత్తమ సాహిత్య పత్రికాత్వాన్ని ఇంకా పెంపొందించుకొంటుందని ఆశిస్తున్నాను. —ఇ. హరిబాబు

పుస్తక సమీక్ష :

## చకోర సందేశము

రచన : **మోటూరి వేంకటరావు**

**పూల్‌బాగ్‌రోడ్, విజయనగరము**

చకోరసందేశ మన్న ఈ చిన్న కావ్యము కాళిదాసుని మేఘసందేశ కావ్యవస్తువును దిరుగవేసి చేసినది. ఇందు యక్షి, యక్షునకు చకోరికవల్ల సందేము పంపును. పీఠికలో విశ్వనాథ సత్యనారాయణగా రన్నట్లు దీనినిట్లు తిరుగవేసి చూసినవారు లేరు. కాళిదాసు మేఘసందేశమునకు భాషాంతరీకరణములు అనేకములు బయలుదేరినవి. సంస్కృతము నందును, తెలుగు నందును కాళిదాసు మేఘసందేశము ఒక సందేశ కావ్యజాతినే పుట్టించినది. ఈ యన్నియు మేఘసందేశమునకు వట్టి యనుకరణములు మాత్రమే ఎంత మహా ప్రతిభావంతుడు వ్రాసినను కాళిదాసునిముందు దివ్విటీముందు దీపమైపోవలసినదే. దానికి కారణము కాళిదాసు చూచిన ప్రక్కనుండియే అనుకర్తలు చూచుట. రెండవప్రక్క నుండి చూచుట ఎవ్వరును చేసినది కాదు. ఈ కావ్యకర్తయందలి వైశిష్ట్య మిది. ఇట్లు చూచుటవల్ల కాళిదాసు భావనకు తక్కిన సగమును పొసగించి పరిపూర్ణత్వము కల్గించుటకు ప్రయత్నించినాడు కవి.

శృంగారరసము నాయికా నాయకోభయాలంబకము. అందుచేత రెండు ప్రక్కలనుండి వ్యంజితమైన గాని దాని యాస్వాదనమునందు పరిపూర్ణత్వ మేర్పడదు. కాని సందేశకావ్యములం దీ పరిపూర్ణత్వము దుస్సాధ్యము.

మఱియు నీకాలమునం దిట్టివస్తువును గ్రహించుటకు కవియైనవానికి మిక్కిలిధైర్యము కావలెను. ఎందుచేతననగా సందేశకావ్యములందు వస్తువైచిత్రి లేదు. అందుచేత అచ్చట రసము ప్రధానముగా నాయికా నాయకులలో నొకరినే యాలంబించి యుండును. సందేశకావ్యముల తీరిట్టిది. దీనికి కారణములు రెండు, (1) నేటి పాఠకులకు పలుమందికి ఈ జాతివస్తువునం దాభిముఖ్యము లేదు. (2) దీనిని స్వీకరించి నిర్వహించుట కనంతప్రతిభ కావలయును. నిర్వహించినను మహాప్రభువైన కాళిదాసుని కృతితో గలిపి కాని దీనిని చూచుటకు వీలు లేదు అట్లు చూచినప్పుడు దానిముం దిది ప్రకాశించుట కష్టము. అంత యనంత ప్రతిభ కలిగినవాడు యొక స్వతంత్రమైన వస్తువును స్వీకరించి రచన చేసినచో దానికి వచ్చు ప్రశస్తిముందు దీనికి గల్గు ప్రశస్తి ఎంత? యన్నమాట కలదు. వస్తువును తిరుగవేసి చూచుటలో నెంత వైశిష్ట్యమున్నను ఆ తిరుగవేత అనగా యక్షివిరహగాథ కాళిదాసుని యుచ్ఛిష్టమే యగును. పూర్వగాథ లన్నియు బహు కవులు స్వీకరించిరిగదా అప్పు డీ దోషము వారికి పట్టదాయన్నచో నా కథలకును

దీనికిని చాల భేదమున్నది. ఈకథ కేవలము కాళి దాసుని ప్రతిభాప్రసవము. ఇందుచేత కాళిదాసుని వస్తువును తిరుగవేసి చూచుటలో నెంత వైశిష్ట్య మున్నను, అది పోయినత్రోవనే తిరుగవచ్చుట వంటిదై చర్విత చర్వణమై పోవును. అందుచేత కాళిదాసు యక్షిగతమైన విరహమును వ్యంజింప జేసినాడుగాని బహుధాప్రపంచించలేదు. ఇట్టి యితివృత్త మెన్నుకొనుటలో గ్రంథకర్త మిక్కిలి యిరుకుత్రోవన నడువవలసి వచ్చినది.

మఱి యక్షి దూతిగా చకోరిక నెన్నుకొన్నది. ఈ చకోరసందేశము మేఘసందేశ కృతికి జంటగా కవి నిర్దేశించుకొన్నాడు. చకోరమునకును మేఘ మునకును జంటకుదురదు. మఱి సందేశము పంపు కాలము వర్షర్తువు చకోరములకు వర్షఋతువు చుక్కెదురుగదా. అందుచేత కవి ఏ చాతకమునో మయూరమునో దూతగా నెన్నుకొన్నచో బాగుం డెడిది. ఏ కాలమునకు యక్షుడు సందేశ మంపెనో సరిగా నా కాలముననే యక్షి సందేశ మంపి యుండవలెను.

"అష్టమాసములయ్యె నేటికి-శ్రావణ మ్ముద యింపనున్నది"

ఇందుచేత చకోరము ప్రేష్యముకాదు. ఇట్లు ఇతి వృత్తము నెన్నుకొనుటలో వైశిష్ట్యముతోపాటు దోషములు సన్నిహితములై యున్నను కవి తన ప్రతిభచే తన దోషములను సంవ్రియమాణములను చేసెను.

ఈ కవిప్రతిభ ఈ కావ్యమునందు ముఖ్యముగా పదలాలిత్యమును సంతరించుటలో నున్నది. కావ్య మును చదువుచున్నంతసేపును పూలప్రక్కవై దొరలాడుచున్న ట్లుండును.

ఈ కావ్య మెచ్చట చదివినను ఈ కవి శక్తి మంతుడని యనిపించును. సుకుమారమైన ఊహలు మధురమైన రచన కలిపి పోతపోసినట్లున్న దీ కావ్య మనవచ్చును. సాధారణముగ నిట్టి కావ్యములలో పునరుక్తి దోషము తప్పదు. ఈ కావ్యమందు కూడ నీ దోషమున్నది. కాని యది యంతగా పట్టించుకొన రాదు. రసమును స్వశబ్దముచే వాచ్యముచేయుట దోషము. ఆ దోషముకూడ ఈ కావ్యమం దున్నది.

మఱికొన్ని యూహా లతిలోకమైన వీ కావ్యము నందున్నవి.

మామకీన మనస్సమూఢ తమస్సమూహము
లే వియత్
సీమలందు మలీమసాకృతి తేలియాడుచు లీలగా
భ్రామికార్మ్మియలై—
నీ చూపులన్ రజతాద్రి వెన్నెలచూరు మొగ్గగ
చొక్కపున్ రూపుతో—
కలువపుప్పొడి తావులన్, వెలిగ్రక్కి గాలుల
మెపుచున్—

తత్ర తత్ర ఇట్టి విశిష్టమైన ఊహాలు కలవు.

పద్య రచనయందు కూడ ఈ కవి శక్తిమంతు డని చెప్పవలెను. గ్రంథమునందలి ద్వితీయ ఖండ ములో రచనలోని గడుసరితనమును పట్టియిచ్చును.

ప్రధానముగా నీ గ్రంథమునం దున్న గుణము పదలాలిత్యమని వెనుకచెప్పితిని. పదలాలిత్యము వేఱు, పలుకుబడి వేఱు. ఈ పలుకుబడి తెలిసి చేసిన రచనయే శాశ్వతముగా నిలుచును. సంస్కృ తాంధ్రములందు ప్రసిద్ధులైన మహాకవుల రచనల యందు ఈ పలుకుబడి తొణికిసలాడుచుండును. కాబట్టి వారి కావ్యములు నిల్చినవి. ఈ కవిలో పలుకుబడి లేదనరాదు కాని ఆ పలుకుబడియం దీ కవికి ద్రఢిమలేదని చెప్పక తప్పదు. ఈ కవి ప్రతిభకు తగ్గ శబ్ద వ్యుత్పత్తి కలవాడు. గ్రంథము నందు శబ్దప్రయోగ మంతయు నొండు రెండు చోట్ల దప్ప పరిశుద్ధముగా నున్నది.

తమిస్రపదార్థము - మేఘదూతి.

తమిస్ర యనగా చీకటిరాత్రి. నల్లనైన యను నర్థమం దిచట వాడబడ్డది. లక్షణ చెప్పుకొనవచ్చు నన్నను తమ శ్శబ్దము వాడిన సరిపోవును. మేఘ దూతి అచ్చు తప్పు కావచ్చును.

కడ కొక్కమాట. వట్టివస్తువు అభిప్రాయములు మాత్రమే చెప్పుట నవ్యత యనబడుచున్న రోజు లలో వీనిని వదలి రచన-భావన-వీనియందు నిష్ఠ కలిగి; వస్తువునం దభిప్రాయములందు కాక వాని నాశ్రయించి కవి పొందు ననుభూతియందు నవ్యత యున్నదని ఎఱిగినవారు వ్రేళ్ళమీద లెక్కపెట్ట దగినంత మంది మాత్రమే యున్నారు. వారిలో నీయన నొకడు. ప్రతి విషయమునందును ఈ గ్రంథము జాగ్రతగా తీర్చబడినదనిచెప్పవచ్చును.

—ఉపాధ్యాయుల నరసింహమూర్తి.

లక్షలకొలది భారతీయుల కొఱకు మంచి సిగరెట్లు

చౌకగా

దిహింద్ టుబాకో అండ్ సిగరెట్ కం. లిమిటెడ్

హైదరాబాదు-ద. వారు

తయారుచేయుచున్నారు.

* అజంతా

* ఎల్లోరా

* ఓల్డుఫెలో

స్ఫూర్తిదాయకాలైన ఈ సిగరెట్లు
ఆరోగ్యపూర్ణ వాతావరణములో
ఆధునిక యంత్రములలో నిర్మింపబడినవి.

విశేషజ్ఞులచేత నిర్ణయింపబడిన పొగాకు.

ఏర్‌కండిషండ్ గోదాములలో ఉంచుటచేత ఈ సిగరెట్లు ఎప్పుడూ తాజాగా ఉంటవి.

## PROCEEDINGS OF THE DIRECTOR OF PUBLIC INSTRUCTION, ANDHRA PRADESH.

R. C. No. 973 M 4/58. Dated 8—6—59.

The following Telugu monthly is commended for use in all the Libraries of Schools, Colleges and public Libraries in the State.

Name: **JAYANTI**

K. RAGHAVA REDDY,
*For Director of Public Instruction.*



## HEALTH & LOCAL ADMINISTRATION DEPARTMENT

G. O. Ms. No. 2379 Tel. A D/ 26 September 59

The Government commend the purchase of the Telugu Literary Monthly Magazine "JAYANTI" published by Sri J. Gouthama Rao, by the libraries maintained by them.

**M. Lokanatham,**
*Dy. Secretary to Government.*

'జయంతి' రైల్వేస్టేషనులోని 'హిగిన్‌బాథమ్స్' పుస్తకాలంలో దొరుకును.

516, సుల్తాన్ బజార్, హైదరాబాదునుండి జువ్వాడి గౌతమరావుచే ప్రకటితము. ఫోన్ : 4616.
అజంతా ప్రింటర్సు, సికింద్రాబాదు.